మొదటి ముద్రణ:

ఆగస్టు 1990
ప్రతులు: వేయి
ముఖచిత్రం:
చంద్ర

ముద్రణ:
రావ్స్ ప్రింటర్స్
నల్లగొండ.

ప్రచురణ:
సాహితీ మిత్రులు
నల్లగొండ.
ప్రతులకు:
బి. సిద్దార్థ మల్లిక్
చేతన కాటేజ్
మాన్యంచల్క
నల్లగొండ-508 001.
మరియు
విశాలాంధ్ర బుక్ హౌజ్
సుల్తాన్ బజార్
హైదరాబాద్

వెల: రూ॥ 12/-

గతంలో మేం ప్రచురించిన కథలు, కవితలు, నవల సమీక్షల ద్వారా పత్రికల మెప్పును, ప్రతుల అమ్మకం ద్వారా పాఠకుల ఆదరణనూ పొందాయి. అదే నమ్మకంతో ఈ "దున్న"ను మీ ముందుంచుతున్నాం. మంచిగా అనిపిస్తే మరొకరికి చెప్పండి. లేదా మాకే తెలియపర్చండి.

మరోమాట, మేము ప్రచురించిన "ఎచ్చరిక" కథలకు నాగార్జున విశ్వవిద్యాలయం వారి శ్రీ శ్రీ స్మారక బంగారు పతకం, "జాతర" నవలకు తెలుగు విశ్వవిద్యాలయం సాహిత్య పురస్కారం లభించాయని తెలుపుటకు సంతోషిస్తున్నాం.

అంతే కాదు "జాతర" ను మైసూరు విశ్వవిద్యాలయం వారు బి. ఎ. ఇ.డి కి ఉపవాచకంగ కూడ ఎంపిక చేసినారు.

—సాహితీ మిత్రులు నల్లగొండ.

○ ఈ కథలను క్రితంలో ప్రచురించిన ఆంధ్రజ్యోతి, ఉదయం, ఆంధ్రప్రభ, పల్లకి సంపాదకులకు–

○ అమూల్య అభిప్రాయాన్ని అందించిన డి. రామలింగం గారికి

○ ముఖ పత్రం గీసిన చంద్ర గారికి–

○ సంకలనపు బాధ్యతనుస్వీకరించిన ఎ. ఈశ్వరయ్య గారికి

○ ప్రచురించిన సాహితీ మిత్రులకు నా కృతజ్ఞతలు

బోయ జంగయ్య
చేతన కాటేజ్
నల్లగొండ.
508 001

నా గైడ్

డా॥ నోముల సత్యనారాయణ గారికి

కృతజ్ఞతలతో

-బోజ

## ఇందులో

# జీవితసత్యం తాలూకు
# కీలకం ఎరిగిన కథకుడు

నేటి తెలుగు కథా రచయితలలో బోయ జంగయ్యకు ఒక విశిష్ట స్థానంవుంది. జీవితపు మలుపులు, అనే కథతో కథా ప్రపంచములోకి అడుగుపెట్టిన ఈయన "లోకం" "గాౖరెలు" అనే కథా సంపుటాలను సాహితీ లోకానికి అందించారు. రెండవ దానికి సుప్రసిద్ధ కథా రచయిత, నవలా రచయిత శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రి గారు తొలి పలుకు వ్రాస్తూ జీవితాన్ని బాగా చదివిన వారే ఇటువంటి కథలు వ్రాయగలరనీ, విషాదాన్ని వెలుగులోకి తేవడం వల్ల ఈ కథలకి పదునొచ్చిందని అన్నారు. తెలంగాణా జిల్లాల్లో ప్రజలు ఎలా వుంటారో ఎట్లా జీవిస్తారో ఈ కథలు చదివాకే తమకు తెలిసిందని కూడా వారు చెప్పారు.

జంగయ్యగారి మూడవ కథాసంపుటి 'ఎచ్చరిక'ను రిలీజ్ చేస్తురాచ కొండవారే ఈ కథల్లో జీవిత చిత్రణవుంది, ఓ లక్ష్యం ఓ సూత్రం రన్నవుతుంది, అని వ్రాక్రుచ్చారు. లక్ష్యం ఏమిటంటే ఈ వ్యవస్థ. మారాలనే ఉద్దేశం. ఇప్పుడు వీరు ఈ నాల్గవ సంపుటిని పాఠకలో కానికి సమర్పిస్తున్నారు. ఈ విధంగా ఈయన ఇప్పటికే లబ్ధ ప్రతిష్ఠుడైన కథా రచయిత.

జంగయ్య గారి కథల ప్రస్తావన వచ్చినపుడు కొడవటి గంటి కుటుంబరావు గారు ఎప్పుడో 1955 లో ఒక వ్యాసంలో వ్రాసిన ఈ దిగువ మాటలు నాకు గుర్తుకు వస్తాయి. "శ్రామిక వర్గంలో కళా చైతన్యం వస్తుంది. జీవిత సత్యం తాలూకు కీల కం వారి చేతిలో వుంది. వారిలోనుంచి కథకులు బయలుదేరి, తమ జీవితాన్నీ, దని వెనుక దాగి వుండే సత్యాన్నీ చిత్రించడం ప్రారంభించినాక, ఈనాడు మనం చూసి మురిసే సాహిత్యం పేల పిండిలాగా గోచరిస్తుంది. ఆ వర్గం నుంచి గోర్కీలు.... బయలుదేరే రోజు అట్టే దూరం లేదు." ఆ వర్గంనుంచి వచ్చిన ఒక రచయత జంగయ్య ఈయన అగ్రేరియన్ రెవల్యూషన్ కోసం సాయుధ పోరాటంసాగిన నల్లగొండజిల్లాలో పంతంగి గ్రామంలో1942లో జన్మించారు. అంటే దేశస్వాతంత్ర్యం కోసం సాగిన చివరి ఉద్యమ మైన క్విట్ ఇండియా ఉద్యమ కాలంలో తెలంగాణా రైతాంగ పోరాటం ముగిసినా ఫ్యూడల్ వ్యవస్థ అవ శేషాలలో గ్రామాలలోజరిగే అన్యాయాలనూ, గ్రామ పెత్తందార్ల దురంతాలనూ, దొరల భూమి పంచాయతీలనూ, పీడిత తాడిత జనాన్ని శిక్షించేవిధానాలనూచూస్తూ ఈయనపెరిగాడు. ఆవాతావ

రణంలో పెరుగుతూ హైస్కూలు చదువు పూర్తి చేసుకున్నాడు. ఆ తర్వాత గ్రామాలలో జరిగేదోపిడిని ఏదోఒక రూపంలోస్వయంగా ఎదిరించాడు. కాబట్టే ఈ వ్యవస్థలో బాధితులైన వారిని గూర్చి ఈయన కథలు వ్రాశాడు తెలంగాణా గ్రామీణ వ్యవస్థ సమస్త మైన దాని లక్షణాలతో, అందులో జీవించేదున్నలతో, గొర్రెలతో, పొట్టేళ్ళతో,నక్కలతో,కుక్కలతో,తోడేళ్ళతో, పులులతో,సింహాలతో, ఈయన కథలలో దర్శనమిస్తాయి. వీరి కథలు జీవితాన్ని ప్రతి బింబించడమే కాక, జీవితాన్ని వ్యాఖ్యానించి, జీవిత సత్యాలను ఆవిష్కరిస్తూ ఉంటాయి. ప్రజలను చైతన్య వంతులను చేసే కథ లువీరివి.

ప్రస్తుత సంపుటిలో 'నాపేరు రాయొద్దు' అనే కథ ఆద్యంత మూ ఒకే లక్ష్యంపై చూపుతో సాగిన. రచన దీనిని చదివినవారు రచయిత చూపిన పని తనాన్ని గుర్తించక పోరు. తన కూతురు తండ్రి పేరు కాన్వెంట్ అడ్మిషన్ ఫారంలో వ్రాసి, తండ్రి చేత సంతకం పెట్టించడం అవివాహితయైన తల్లి శిరష ఎదుర్కొన్న సమస్య రెక్కలురాని పిల్లల ముందు పెద్ద పిట్టలు ప్రేమతో మూల్గిన శబ్దాలను రచయిత ప్రస్తావించి, నాగరికతలో జీవించే మానవ సంతానం బంగళాకూ బ్లాంక్ చెక్కుకూ మాత్రమే నోచుకుంది గాని, కన్న తండ్రి గార్డియన్ షిప్‌కు నోచుకోలేదని చెప్పి అంద రికీ సమానమైన చోటుశ్మశానం (death the leveller) గేటు బోర్డులపై వ్రాతలు చదివి ఉత్తేజితురాలై,తండ్రి స్థానంలోతానే సంతకం చేస్తానని నిర్ణయించుకొని ఆమె కళ్ళల్లో కొత్త కాంతిని పొందడమూ, పతనం చెందిన ఆమెను రచయిత లేపి నిలబెట్ట డమూ, చేరువ అవుతూవున్న నగరం అరణ్యంలా ఆమెకు కన్పి

స్తోందనీ, అయినా ఆమె నడక చాలించక జీవించడానికే ముందు కెళ్ళిందనీ సూచించడమూ–ఇంత జీవిత సత్యాన్ని అంత ప్రభావవంతంగా చెప్పడమూ, కాన్వెంటులో మేరిమాతచిత్రాన్నీ క్రీస్తు శిలువనూ ప్రత్యేకించి పాఠకుని దృష్టికి తేవడమూ రచయిత దర్శనశక్తికీ, ధ్వని ప్రధానమైన రచనా శిల్పానికీ తార్కాణంగా వుంది.

వీరి 'మల్లెపూలు' కథ గురజాడ అప్పారావు గారి కథ 'దిద్దుబాటు'ను జ్ఞాపకానికి తెస్తుంది. (గురజాడవారి కథ 1910 ఫిబ్రవరిలో ప్రచురితమైంది. దాని తోనే 'కొత్తమాదిరి' ఆధునిక కథ తెలుగులో ఆవిర్భవించిందని విమర్శకులు భావిస్తున్నారు. గురజాడవారి కథ లక్ష్యం వేశ్యా మోహంలో పడి ప్రోనాచ్ అయిపోయినభర్తలను దిద్దడం, వారు పశ్చాత్తాప పడేట్టు చేసి వారికి గుణపాఠం చెప్పడం జంగయ్య గారి ఈ కథలో ఒక వారకాంత కులకాంతలకు పెద్దకనువిప్పు కలిగిస్తుంది. భర్తలకు అందివ్వవలసిన శృంగారాన్ని ఇవ్వకుండా, సరసంలో సంసారంలో సమానత ఉండేట్టు చూచుకోకుండా, సాంఘికసమానత్వంకావాలంటూ వనితలు ఉద్యమాలతో సందడి చేస్తూ సంసారాన్ని స్వర్గంగా మార్చుకోలేక శృంగారం హోరికే చోటికి తమ పురుషులుపరుగెత్తితే అల్లరి పెట్టడంబాగా లేదని వారకాంత వారిని మందలిస్తుంది. ఈ కథను కొంత పచ్చిగా వ్రాసినప్పటికీ, స్త్రీ పురుషుల కలయిక ఓ అందమైన అనుభవం అని మీలో ఎందరికి తెలుసు? అది పాపమైతే ఈ సృష్టికే అర్థంలేదు అని రచయిత వారకాంతచే అనిపించారు. ఏమైనప్పటికీ మల్లెపూలను గూర్చి ఆ మయూరి అన్నమాటలు కులకాంతలపై ప్రభావం చూపాయి అందుకు

నిదర్శనం-ఆ మరుసటి రోజు ఆ ఊరి బజారులో మల్లెపూలు దొరక లేదట వారకాంత కోసం!

జంగయ్యగారు 'వాయిదాపడిన కేసు' 'నిజం' 'పోస్ట్ మార్టం' వంటి సంక్షిప్త కథలలో నిజజీవితంలో ఒకానొక స్థితిని ప్రొజెక్ట్ చేసి అంతటితో వదిలేస్తారు. పర్యవసానాన్ని చెప్పడం ఆయన పనికాదు పరిశీలన చేస్తే ఒక ఘటన ఎలా జరిగిందో తెలియవచ్చు. కాని అలా ఎందుకు జరిగింది అంటే ఏమి చెప్ప గలం? ఒక్కొక్కప్పుడు వాస్తవ జీవితంలో **అనుకోనివి జరుగు** తాయి. 'నిజం' అనే కథలో అత్యాచారానికి గురి అయిన కన్యకు ఆ దుర్మార్గుని వధించిన తర్వాత, తనశీలాన్ని గూర్చిన బాధ ఆమెను విడిపోయిందట. ఆమెలో వెనుకటి కళ మళ్ళీ కన్పించిం దట మనిషిలో గూడు కట్టుకున్న కసి, పగ తీర్చుకున్న తర్వాత మానసికంగా relief కలుగుతుందని మనస్తత్వ శాస్త్రజ్ఞులు చెబుతారు. సామాన్యులు ఆ సూత్రానికి అతీతులు కారు.

మబ్బులు, వైకుంఠపాళి నేటి సమాజంలో ఆయాపరిసరాల ప్రభావంవల్ల వ్యక్తులు-స్త్రీలుం పురుషులూ పోయే పోకడలనూ వారు చెందే పతనాలనూ చిత్రించాయి. ఊరిమేలుకోరి అమ్మ వారికి వదిలేసిన దున్నను దురాగతాలకు పాల్పడే గ్రామకరణం తో పోల్చివ్రాసిన కథ అజ్ఞానాన్ని మూఢ నమ్మకాలనూ పటా పంచలు చేసి గ్రామ శ్రేయస్సు దృష్ట్యా దుష్టుల ఆగడాన్ని అరికట్ట-లసిన ఆవశ్యకతను నొక్కి చెప్పింది.

జంగయ్యగారి కథలలో ఒక ప్రత్యేకత ఏమిటంటే—వాటి ఇతివృత్తం ఎంతో ప్రాధాన్యత కలిగి ఉండటమే కాక, వాటిని చెప్పే పద్ధతి కూడా విలక్షణంగా ఉంటుంది. అది ఎవరికీ అనుకరణ కాదు. కథా సంవిధానంలో ఈయనపై ఎవరి ప్రభావమూ ఉన్నట్లు కన్పించదు. ఆయన బాణీ ఆయనదే, లోక జ్ఞానం, సూక్ష్మబుద్ధి, చతురత కథను ఎక్కడికక్కడ పదును పెడుతూ, రచయిత ఆశించిన లక్ష్యంతో పర్యవసిస్తాయి. వీరి ఉపమానాలు కొత్తగా, సందర్భానికి గుణకరంగా ఉంటాయి. పసిడిని పాలల్లో కరిగించి పోతపోసిన రూపం, ఎర్రరంగు మారుతికారు కాలువనీటిలో కొట్టుకొచ్చే ఎర్రమందార పువ్వులావుంది, ఇత్యాదులు. ఎక్కడైన ఒక కథలో సంభోగ శృంగారం తాలూకు ప్రాథమిక ఘట్టాన్ని సూచించడం కూడా కద్దు ఉదాహరణకు "మబ్బులు" అక్కడ అది వ్రాయడం అవసరమా అనేది చర్చనీయాంశమవుతుంది. అభిప్రాయాలు భిన్నంగా ఉండవచ్చు కొందరు కథలను teenagers కూడా చదువుతారు కదా అని వాదించ వచ్చు.

స్వరూపంలో, స్వభావంలో సమకాలిక జీవిత ఖండాలైన ఈ కథలు తెలుగు కథా సాహిత్యానికి మేలు బంతులవంటి ఉపదలు.

నెం 1-8-726/30,
నల్లకుంట, హైద్రాబాద్-44

డి. రాములింగం
జూన్ 1 1990.

# నా పేరు రాయొద్దు

ఎప్పుడో పట్టణ శివారున కట్టిన కాన్వెంట్, చుట్టూరా నివాస గృహాలు, పరిశ్రమలు, కార్యాలయ భవనాలు, హోటళ్ళు, సినిమా థియేటర్లు, గుళ్ళు, మసీదులు, చర్చిలు పెరుగగా కొత్త కొత్త రోడ్లతో ఇప్పుడు కాన్వెంట్, నగరం మధ్యలో కొచ్చినట్లయింది.

ప్రభుత్వపు గ్రాంటుకు ఆశించని ఈ కాన్వెంట్‌పై అధికారుల పలుకుబడి నడవదు. నాయకుల పైరవీలు నడవవు. అందుకని అందులో క్రమశిక్షణతో కూడిన చదువు చెపుతారు.

చాలామంది తమ తమ పిల్లలను ఆ స్కూల్లోనే చదివించాలని ఉబలాట పడుతుంటారు. అందరిలాగే శిరీష తన ఒక్కగా నొక్క కూతురు గీతను, అందులోనే చదివించాలని నిర్ణయించుకుంది.

ఉదయం స్కూల్ టైమ్ కల్లా గీతను వెంటబెట్టుకుని స్కూల్ ఆవరణలో అడుగు పెట్టేసరికి, ఒకేరకం డ్రెస్‌లో పిల్లలంతా పావురాల గుంపు భూ మ్మీదకు దిగినట్లు అనిపించింది. సన్నని నవ్వులు, నిష్ఠురపు కొట్టుకోవడాలు, నిలదీసి అడగడాలు, సినిమా ముచ్చట్లు ఒకటేమిటి? రక రకాల కబుర్లు. తల్లిచేయి వదిలి రేపటి నుంచి తాను వీళ్ళతో ఆడుకోవచ్చు అని ఏదో కొత్త లోకాన్ని కనుక్కున్నట్లు నిలుచుంది గీత.

వెనక్కు చూసిన తల్లి మళ్ళీ గీత వేలు పట్టుకుని "పద" అంటూ ప్రిన్సిపాల్ రూమ్ వైపు నడిచింది.

ప్రిన్సిపాల్ ఫ్లవర్ వాజ్‌లో తెల్లని లిల్లీ ఫ్లవర్‌లా, తన కుర్చీలో కూర్చొని పిల్లల ప్రోగ్రెస్ కార్డ్సు మీద సంతకాలు చేస్తూంది.

ఆమె తల మీద గోడకు మేరీ మాత బొమ్మ అమర్చి ఉంది. ఎదురుగా టేబుల్ మీద ఓ గ్లోబ్, దాని ప్రక్కనే శిలువ గుర్తు, మరో పక్క కొన్ని రిజిష్టర్లు. వాటి మీద రెండంగుళాల పేము బెత్తం, కాలింగ్ బెల్ ఉన్నాయి.

గీత చేయిపట్టుకొని శిరీష లోనికి వస్తూ "గుడ్ మార్నింగ్ మిస్" అంది.

"మార్నింగ్" అంటు ఎదురుగా విజిటర్స్ కోసం ఉంచిన కుర్చీల వైపు చూపిస్తూ "ప్లీజ్ బీ సీటెడ్" అంది.

"థ్యాంక్యూ'' అంటూ కూర్చుంది.

రాయడం ఆపి పెన్ను కాగితాల మీ దుంచి శిరీషను ఉద్దేశిస్తూ "చెప్పండి'' అంది.

పక్కన ఉన్న గీతను తన ఒడిలోకి లాక్కుంటూ, "నా కూతురును స్కూల్లో చేర్పించాలని."

"ఖాళీలు లేవు'' అంటూ పెదవి విరిచింది.

''ఎలాగైనా ఒక్క-''

''నో-నో!"

"దయచేసి - ఒక్క సీటు - నేనే మధ్యలో చదువును ఆపేసి బతుకును బండల పాలు చేసుకున్నా. నా బిడ్డ అలా కాకూడదు, బాగా చదువుకుని"

''సారీ!''

"మంచి స్కూల్లో వేస్తే బాగా చదువుతుంది. అని ఆశ, కాదనకండి. ప్లీజ్'' అంటూ దోసిలి పట్టింది. దీనంగా శిరీష.

"అందరూ ఒక్క సీటు, ఒక్క సీటు అంటే ఎలా, అడిగే వాళ్ళకు ఒక్కటే కావచ్చు కానీ అడిగిన వాళ్ళందరికీ ఇస్తే -

ఇక క్లాసులెలా నడప గలం? అప్పుడు మీరు ఆశించే మంచి చదువు పిల్లలకు అందివ్వ లేము.

శిరీష మాట్లాడలేదు. ఆ ముఖంలో ఇంతకుముందున్న కళ పోయి నిరాశ నిండుకుంది.

"మీరు ముందే ఎందుకు ప్రయత్నం చేయలేదు?" అంటూ టేబుల్ మీది శిలువ వైపు చూసి కాసేపు ఆరూపాన్ని కళ్ళల్లో దాచుకున్నట్లు కళ్లు మూసి తెరిచింది.

శిరీష మౌనంగా అలాగే కూర్చుంది.

"పోనీ వచ్చే సంవత్సరం వరకు ఆగండి. అప్పుడు ఆలోచిద్దాం" అంది.

"మీ ఇష్టం. నాకో అడ్మిషన్ ఫారం ఇప్పిస్తే చాలు, మీరు ఎప్పుడు జాయిన్ చేయమంటే అప్పుడే చేస్తాను."

"హుఁ" అంటూ లేచి అల్మారాలో నుంచి ఓ అడ్మిషన్ ఫారం తీసి దాని పై భాగాన ఓ పక్కకు సంతకం చేసి ఇస్తూ "దీన్ని నింపి, మీవారి సంతకం చేయించి తీసుకురండి" అంటూ ఫారం శిరీష కిచ్చి టేబుల్ మీద బెత్తాన్ని చేతిలోకి తీసుకొని బయటకు నడుస్తుంటే– "వారు ఊళ్ళో లేరు. వారి సంతకమే కావాలా?" అంటు ఆతురతగా ఆమె వెంట నడుస్తుంది.

"అడ్మిషన్ గద, ఫాదర్‌దే కావాలి."

ఫస్ట్ బెల్ మోగింది.

పిల్లలందరూ ప్రార్థన కోసం లైన్‌గా నిలుచుంటున్నారు. మిస్ అటు వైపు పోగా శిరీష గేట్ వైపు నడిచింది. ఆమె వెంట గీత.

* * *

మలక్‌పేట లోని టీ.వీ. టవర్ పక్కన రెండొందల గజాల విస్తీర్ణంలో అందంగా నిర్మించిన ఓ చిన్న ఇల్లు. చుట్టూరా ప్రహారీ గోడ, రోడ్డు వైపు ఓ గేటు. గేటు నుంచి మెయిన్ డోర్ వరకు రంగురంగుల నాపరాతి ముక్కలు పరచిన బాట. బాటకిరువైపులా పూలకుండీలు, మల్లెపొదలు, రెండు మెట్లెక్కి లోపలికెడితే ఓ హాలు, హాల్లో కేన్ సోఫాలు, వాటిలో ఎంబ్రాయిడరీ అల్లిన మెత్తని కుషన్స్, మధ్యన టీపాయ్, దాని మీద ఫ్లవర్ వాజ్, ఆ హాల్‌ను ఆనుకొని డ్రెస్సింగ్ రూమ్, కుడి వైపు డైనింగ్ హాల్, దాని ప్రక్కనే కిచన్, వాటి వెనక కొంచెం ఖాళీ స్థలం. అన్ని సౌకర్యాలున్న ఆఇంటిని పదేళ్ళ క్రితం రాజారావు తాను యం.ఎల్.ఏ గా ఉన్నప్పుడు ఊరి నుంచి వస్తే ఉండటానికి కట్టించుకున్నాడు. కానీ యం.ఎల్.ఏ. క్వార్టర్స్‌లోనే ఉండి యం.పి. అయ్యాక బంజారా హిల్స్ లో మంచి బంగళా కట్టించుకున్నాడు.

పెద్ద పెద్ద కంపెనీల్లో షేర్స్ కొని పెద్ద ధనవంతుడైనాడు. ఎక్కువ ఢిల్లీలోనే మకాం. ఎప్పుడన్నా హైదరాబాదుకు వచ్చినప్పుడల్లా ఈ ఇంటికొస్తే "కిరాయి అడగడానికి వచ్చాడని" కొందరు, "శిరీష కోసం వచ్చాడని" మరికొందరు. ఎవరు ఏమన్నా అతను పిల్లి లాగే వచ్చి పిల్లి లాగే వెళ్ళిపోతుంటాడు. కొన్నాళ్ళ నుంచి రావడమూ మానేసినట్టుంది.

* * *

ఆ రోజు సాయంత్రం వేళ శిరీష మల్లెలను తెంపు తోంది.

తిరపతమ్మ గేట్ తెరచుకుని లోపలి కొచ్చింది. పూలు ఏరటం ఆపి తిరపతమ్మకు ఎదురుపోయింది శిరీష. తిరపతమ్మ శిరీషకు దూరపు చుట్టం.

అరవై ఏళ్ళ కాకరపండు లాంటి తిరపతమ్మకు ఎవరూ లేరు. కాబట్టి శిరీషతోనే ఉంటుంది. తాను తెచ్చిన కవర్ శిరీషకిస్తూ "ఆయన నాల్గు రోజు లుండి పొమ్మంటే తప్పలేదు."

"పరవా లేదు. సంతకం చేశారా?" అంటు కవర్ విప్పింది. సంతకం చేయలేదు. దానితోపాటు కొన్ని డాక్యు మెంట్స్ "ఇవేమిటి?" అన్నట్టు చూసింది.

"మనం ఉంటున్న ఇంటిని నీ పేర రిజిస్ట్రేషన్ చేసి ఈ కాగితాలు ఇచ్చాడు."

"ఏ మన్నారు?"

"తన పేరు రాయొద్దన్నాడు."

"ఇంకా....!"

"ఇంకా తనను మరచిపొమ్మని కూడా చెప్పాడు."

కొంతసేపు నిశబ్దం చోటు చేసుకుంది. పదిహేను ఏళ్ళ బాల్యం ఎలా గడచిందో గుర్తు లేదు కానీ ఆ తర్వాత పదిహేను ఏళ్ళ ప్రతి క్షణం గుర్తుంది.

"పాప లేదూ?" మాటలు మార్చడానికి.

"బయటికి ఆడుకోవడానికి వెళ్ళింది."

"నేను కాఫీ పెడతాను." అంటూ వంటగది వైపు నడిచింది తిరపతమ్మ.

శిరీష తలనిండా ఆలోచనలే.

చదువు పూర్తి కాగానే పెళ్ళి చేసుకుంటే ఈనాడు సమస్య లుండకపోయేవి. మగవాళ్ళతో పాటు సమంగా బతకాలని ఏవేవో ఆశయాలతో సంఘ సేవ అని తిరిగి, తిరిగి అలసినప్పుడు స్వార్థపరులు అదీ, ఇదని ఆశలు చూపించి ఒంటరితనాన్ని తమకు అనుకూలంగా మార్చుకొన్నారు. ఈనాడు అవసరానికి ఏ ఒక్కరూ నిలవరు.

  

పిల్లలంతా ఒకరి వెనక ఒకరు గింజల్ని మోసుకు పోతున్న ఎర్ర చీమల బారుల్లా కాన్వెంట్ ఆవరణలోకి వెడుతున్నారు - కేజీల కొద్దీ బరువు ఉన్న పుస్తకాల సంచు లను ఈడ్చుకుంటూ.

గేటు కెదురుగా రోడ్డు పక్కన ఉన్న చెట్టు కింద నిల్చుంది శిరీష - అప్పుడే కొమ్మ నుంచి రాలిపడి ఉన్న జామ పండులా, చేతిలోని కవర్‌లో పాప అడ్మిషన్ ఫారం. రెడ్డిగారి రాకకోసం ఎదురు చూస్తోంది. ఏ వెహికిల్ శబ్దమైనా ఆయన కారే వస్తున్నట్లు అనిపిస్తుంది ఆమెకు. కానీ కాదు.

నిమిషమొక రోజనిపిస్తుంది. అతన్ని చూడక చాలాకాలమైంది. పాప పుట్టక ముందు అతని కోసం ఇలాగే ఎదురు చూసే క్షణాలు గుర్తొచ్చాయి.

తన కోసం ఆయన పడిగాపులు కళ్ళ ముందు కదిలాయి. ఏదో మధుర భావం ఆమె పెదాల పైన పూసింది.

అంతలో దూరంగా ఎర్ర రంగు మారుతి కారు కాలువ నీటిలో కొట్టుకొస్తున్న ఎర్ర మందార పువ్వులా వస్తూంది.

శిరీష తలనిండా కొంగు కప్పుకుంది.

అనుకున్నట్టుగా తాను నిలుచున్న చెట్టు కింద కారాగింది. కానీ కారులో ఉండవల్సిన వారు లేరు. ఆధునికతను అచ్చుపోసినట్టుగా ఉన్న ఓ పాతికేళ్ళ యువతి దిగగానే డ్రైవర్ కారును కొంచెం ముందుకు తీసుకెళ్లి పార్కు చేసాడు.

శిరీషకు ఏం అర్థం కాలేదు. బొమ్మలా నిలుచుని చూస్తూంది.

ఆ యువతి శిరీష దగ్గరగా వచ్చి నిలుచుని "నమస్తే మీరు శిరీషగా రనుకుంటా."

"అవును." చేతులు జోడిస్తూ అంది శిరీష.

"నేను రెడ్డి అండ్ కంపెనీ నుంచి వచ్చాను. రెడ్డి గారు పంపించారు. నేను వారి దగ్గర అకౌంట్స్ మేనేజర్ని"

కార్యాలయాల్లో పనిచేసే స్త్రీలకుండే చొరవ, కలుపుగోలు తనంతోపాటు కార్యాన్ని గట్టెక్కించే చలాకీతనం కొట్టొచ్చినట్టు కనపిస్తూ ఉంది ఆమెలో.

"అలాగా" అంటూ నవ్వును మొహాన పులుముకుంది.

"మా బాస్ ఈ రోజు మధ్యాహ్నం కాంట్రాక్టు పనిమీద కెనడా వెళుతున్నారు. అర్జంట్ వ్యవహారాలు చూడడంలో నిమగ్నమైనందు వల్ల నన్ను పంపుతూ, ఈ కవర్‌ను మీ కివ్వమన్నారు." అంటూ తాను తెచ్చిన సీల్డ్ కవర్‌ను శిరీష కిచ్చింది.

''నిన్న మీరు ఫోన్ చేసినప్పుడు వారే వస్తామన్నారట, కానీ వీలు పడలేదు. మరోలా భావించ వద్దన్నారు.''

శిరీష మౌనం వహించింది.

"తోటి స్త్రీగా నాదో సలహా, ఇప్పటికే మీరు దగాపడ్డట్టున్నారు. గతాన్ని మరచిపొండి. రేపటి కోసం ఓ రూపును ఊహించుకొని బతకండి. ఈ కవర్‌లో సంతకం చేసిన ఓ బ్లాంక్ చెక్ కూడా ఉంది. మీరు ఎన్ని లక్షలకు రాసుకుంటారో, రాసుకుని, డ్రా చేసుకుని, మీ పేరు మీద బ్యాంకులో వేసుకోండి. అంతే కాని అర్థంలేని ఆవేశంతో చేతికి అందిన అవకాశాన్ని వదులుకోవద్దు. భర్త భార్యకిచ్చేదీ డబ్బే. విటుడు వేశ్యకిచ్చేది డబ్బే. ఏదో హోదాలో ఎప్పుడూ డబ్బు పురుషుడి నుంచి స్త్రీకి వస్తూనే వుంటుంది. వాడుకోండి అంతే. మరి సెలవా?'' అంటు కుడి చేతిని గాలిలో ఊపింది.

శిరీషకు నోట మాట రాలేదు. కానీ ఆమె చేతులు వాటం తట అపే నమస్కరించాయి.

అమె కారు వైపు వేగంగా నడిచిపోయి, సీతాకోక చిలుక మంహారపు పూరేకుల్లో ఇమిడి పోయినట్టు కారులో కూర్చుంది. కారు కదిలి పోయింది.

శిరీష కాళ్ళు కదలడం లేదు. కళ్ళ నిండా నీరు తిరిగి బుగ్గల మీద నుంచి జారి, చెక్కిలి దగ్గరి పెదవి మలుపులో ఆగి చుక్కలు చుక్కలుగా రాలుతున్నవి.

కవర్ విప్పింది. అందులో చెక్కుతో పాటు చిన్న స్లిప్ పైన- "నాపేరు రాయొద్దు" అని రాసి ఉంది. కసిగా స్లిప్‌ను నలిపి పారేసి వడి వడిగా నడిచింది. అప్పుడామె కళ్ళు కోపం తో ఎరుపెక్కాయి. పళ్ళు కసిగా కదులుతూ ఉంటే ముక్కు పుటాల్లో నుండి వేడి శ్వాస బయటికొస్తుంది.

* * *

జర్నలిస్ట్ కాలనీలో ఓ చిన్న ఇంటి గేట్ పిల్లర్‌కు 'ఎం. మురళి, జర్నలిస్ట్' అని బోర్డు ఉంది.

గేట్ ముందు నిల్చున్న శిరీష గేట్‌ను వేళ్ళతో శబ్దం చేసింది.

వరండాలో కూర్చొని రాసుకుంటున్న వ్యక్తి రాయడం ఆపి పెన్నును అలాగే పట్టుకొని ఎడమ చేత్తో కళ్ళద్దాలను

సవరించుకుంటూ లేచి గేటు వైపు నడచి శిరీషను గుర్తించి విప్పారిన ముఖంతో "రండి, రండి" అంటూ గేటు తెరచాడు. నలభై ఏళ్ళ వయస్సుకు, ఆరడుగుల ఎత్తుకు లాల్చీ, పైజామా ను వేశాడు.

''నమస్కార మండీ'' అంటూ ఆమె లోనికి రాగానే గేటును మూస్తూ "ఎన్నాళ్ళకు దర్శనం?" కళ్ళద్దాలను సవరించుకుంటూ అడిగాడు.

"మీకు నేను గుర్తుకు రాకపోయినా, నాకు మీరు గుర్తొస్తారు." అంటూ వరండాలోకి నడిచివెళ్ళే అతన్ని అనుసరిస్తూ ఆమె వరండాలోకి చేరింది.

"కూర్చోండి'' అంటూ కుర్చీని చూపిస్తూ తాను కూర్చున్నాడు.

ఆమె కూర్చుంది.

''ఏమిటి విశేషాలు, గీత బాగుందా?''

"మీరు గీత అని ఏమని పేరు పెట్టారో ఆనాటి నుంచి దాని గీత బాగున్నట్టు లేదు.''

"అంతే?" అంటూ చేతిలోని పెన్నును ఎదురుగా టీపాయ్ మీద క్రితంలో రాసి ఉంచిన పేపర్స్ మీద పెట్టి కాస్త కంఫర్టబుల్‌గా కూర్చున్నాడు.

"దానికిప్పుడు ఐదేళ్ళు, స్కూల్లో చేర్పించాలి."

"చేర్పించాలిగా?" రెండు చేతుల వేళ్లనూ ఒక్కదగ్గరికి చేర్చి పెదాలను తాకిస్తూ రెప్పకొట్టకుండా శిరీషనే చూస్తున్నాడు.

"ఏమిటి అలా కొత్తగా చూస్తున్నట్టు చూస్తున్నారు?"

"రోజు రోజుకూ నీలో కొత్త అందం చోటు చేసుకుంటూందని."

"మాటలతో మత్తెక్కించకండి."

"నా దగ్గర ఉన్నవి అవే కదా."

"మనస్సు లేదా?"

మురళి కళ్ళద్దాలు తీసి టీపాయ్ మీద వుంచి ఓ సారి కళ్ళను ఒత్తుకొని మౌనంగా నీళ్లు నములసాగాడు.

"నే నీ మధ్య ఓ కవిత రాశాను." టీపాయ్‌పై చూపుడు వేలుతో రాస్తు.

"అచ్చా ఏదీ చదవండి?" అంటూ శ్రద్ధగా వినడానికి సర్దుకున్నాడు.

శిరీష కవితను గుర్తు చేసుకుంటూ ఏకాగ్రతలోకి వెళ్లిపోయింది. ఆమెనే చూస్తున్న మురళి ఏదేదో లోకాల్లోకి వెళ్లిపోతూ—

పసిడిని పాలల్లో కరిగించి పోత పోసిన రూపం. ఆమె

నవ్వితే వెన్నెల పరుచుకుంటుంది. ఆమె మాట్లాడితే పూలు చల్లినట్టుంటుంది. ఆమె చూపులు ఎదుటి వాళ్ల కనురెప్పలను నిలేస్తాయి- అనుకుంటూ తాను తన కనురెప్పలను ఆడించడం మరచి పోయి చూస్తున్నాడు.

"నా హృధయాన్ని అడిగిన వాళ్ళందరికీ
అంగుళం చోటు లేకుండా పరిచాను.
తీరా చూస్తే నాకోసం ఖాళీ లేదు.
తిరిగిఅడుక్కోవడానికి ప్రతి తలుపు తట్టాను.
ఏ తలుపూ తెరచుకో లేదు!"

అంటూ ముగించిన శిరీష కళ్ళ నుండి జారిన కన్నీరు టీపాయ్ మీద చుక్కలు చుక్కలుగా పడ్డవి.

"బాగా రాశావు! బాగుంది."

"నిజమా?" అంటూ మురళి పైపుచూసింది తలెత్తి. గుండెలో నుంచి వచ్చే దుఖంతో ఆమె ముఖం ఎరుపెక్కి పోయింది.

"ఏడుస్తున్నావా?" మురళి ఆమె గడ్డం కింద చేయి పెట్టి పైకెత్తి ముఖంలో చూశాడు. రాలడానికి సిద్ధంగా ఉన్న కన్నీళ్ళు అతని అరచేతిలో రాలాయి.

శిరీష మౌనంగా మురళి కళ్ళలోకి చూసింది. అప్పుడామె కనురెప్పలు వర్షంలో తడిచిన అరటి ఆకు అంచుల్లా ఉన్నాయి.

"నిన్ను బాధ పెట్టానా?"

"లేదు. ఉన్న బాధ మిమ్మల్ని చూడ గానే పొంగి పొరలింది." కొంగుతో కళ్ళు బుగ్గల్ని వొత్తుకుని ఓ బరువైన శ్వాసను ఒదిలి. తడసిన కొంగును చూస్తూ "నా కవితను అర్థం చేసుకున్నారనుకుంటా."

" ఆ చాలా గొప్పగా ఉంది. "

శిరీష ఏడవ లేక నవ్వింది.

గీతను స్కూల్లో చేర్పించాలి.

"చేర్పించండి."

''దాని అడ్మిషన్ ఫారంమీద తండ్రిసంతకం కావాలట.''

విషయం అర్థమైంది. మరోసారి నీళ్ళు నమిలాడు.

"నాకు తెలిసిన వాళ్ళను అడిగాను. ఒకరు భవంతిని బహుమతిగా ఇచ్చారు. మరొకరు బ్లాంక్ చెక్ రాసిచ్చారు. కానీ తమ పేరు తండ్రిగా రాయొద్దు అన్నారు.'' అంటు మురళి వైపు చూసింది.

మురళి రాసి ఉంచిన కాగితాల వైపూ, తెరచి ఉంచిన పెన్ వైపూ చూస్తున్నాడు. వరండా కప్పు భాగంలో మూలన పిచ్చుక పిల్లలు గూట్లో నుంచి నిక్కి మేత కోసం వెళ్ళిన తల్లి–తండ్రిపిచ్చుకల కోసం అరుస్తున్నవి.

అది గమనించిన శిరీష "అటు చూడండి" అంది.

ఆలోచనల నుంచి తేరుకొని కదిలి కూర్చుంటూ, పిచ్చుకల

పిల్లలను చూస్తున్నాడు. అంతలో రెండు పిట్టలు ముక్కున కరిచి తెచ్చిన మేతను పిల్లలకు పెడుతూ ఉంటే అవి అదో మాదిరిగా శబ్దం చేస్తున్నవి అది పొట్టలు నిండుతూంటే ఆకలి తీరుతున్న శబ్దం. అది మమకారంతో అల్లుకు పోతున్న శబ్దం. ఆప్యాయతను అందుకుంటున్న శబ్దం. ప్రేమతో మూల్గుతున్న శబ్దం.

మురళి పెన్ను వైపు చూశాడు. తెరిచి వుంచివుండడం వల్ల పాళీపైన సిరా ఆరిపోయి మరక కట్టింది.

''ఆఁ ఇంకా చెప్పండి.''

"నేను మీకు చెప్పవలసిన దాన్ని కాదు, అడగడాని కొచ్చాను.''

''అడగండి.''

''మీరు అడ్మిషన్ ఫారం పైన సంతకం చేయండి.''

ఏదో సుడిగాలి మురళిని చుట్టేసినట్టు అనిపించింది. తన ఆదర్శాలు పేజీలు, పేజీలుగా దూది పింజల్లాగ గాలిలో ఎగురుతున్నట్టు అనిపించింది.

ఇందాక పాళీ పైన సిరా ఆరిపోయినట్టే ఇప్పుడు తన నోటిలో తడి ఆరిపోయింది. కుర్చీలోకి ఒరిగి కణతలను ఒత్తుకున్నాడు. దవడలను అదుముకున్నాడు. తలవెంట్రుకల్లోకి చేతులు అడ్డదిడ్డంగా ఆడించుకుంటున్నాడు. తానీ ప్రపంచంలో వున్నాడా అని అనుమానపడుతున్నాడు.

"మిమ్మల్ని బాధ పెట్టానా?" అమాయకంగా అడిగి అక్కడ ఆవరించిన మౌనాన్ని బద్దలు కొట్టి ....

"నేను మీకు"

"తెలుసు"

"గీత పుట్టుక"

"తెలుసు."

"మరిక వాళ్ళ లాగా నాకోరికను తృణీకరించరనుకుంటా"

' కోరడం అత్యాశ ఏం కాదు. కానీ-"

"మీరు కూడా" మధ్యలో మాటలు ఆగిపోయాయి. కను రెప్పలు ఆడడం మానేశాయి. పెదాలు కలుసుకోవడం నిల్చి పోయాయి.

"సారీ శిరీషా"

మౌనంగా చూస్తు 'ఎంతో ఆశతో వచ్చాను."

"కానీ ముందే రావల్సింది?"

"ఇప్పు డేం మునిగింది?"

"ఒకరు బంగళా ఇచ్చారు. ఒకరు బ్లాంక్ చెక్ ఇచ్చారు. ఇప్పుడు. నీవు క్రితంలా లేని దానివి కాదు. ఉన్నదానివి"

' అంటే?"

"గీతకు తండ్రిగా ఆస్తిని ఆశించాడనుకుంటుంది ప్రపంచం?"

''వాటన్నిటినీ వదులుకుంటాను.''

''రాని దాని కోసం వచ్చిన దాన్ని వదులు కోవడం మంచిదా?''

ఇంతలో లంచ్ కోసం మురళి భార్య ఇద్దరు పిల్లలతో లోనికి వచ్చింది.

"ఈవిడ నా భార్య లత ప్రైవేట్ స్కూల్లో పనిచేస్తుంది. వీడు రవి. ఇది కవిత-'' శిరీషను మళ్ళీ భార్యకు చూపిస్తూ ''ఈమె నా స్నేహితురాలు- ఈ మధ్య కవిత్వం రాస్తుంది" అనే లోపే శిరీష లేచినిలుచుంది.

ఒకరి కొకరు నమస్కరించు కున్నారు.

''రండి భోంచేస్తు మాట్లాడుకుందాం.'' శిరీష నుద్దేశిస్తూ అంటూ లోపలికినడిచింది లత. తల్లి వెంట పిల్లలు.

''నేను భోంచేసే వచ్చానండి.''

''ఏదో కొంచెం'' మురళి మాట పూర్తి కాక ముందే.

"థాంక్స్" అంటు గేట్ వైపు నడిచింది.

* * *

జర్నలిస్ట్ కాలనీ సిటీ అవుట్ స్కర్ట్స్‌లో ఉండడం వల్ల అక్కడ ఆటోలు కనిపించడం తక్కువ. ఎప్పుడో కానీ బస్సులు రావు. అందుకని శిరీష మెయిన్ రోడ్ వైపు నడక సాగించింది.

ఆమె మనస్సు పరి పరి విధాల ఆలోచిస్తుంది. తాను చేసిన పొరపాటుకు తన చుట్టూరా ఎంతటి శిక్షా వలయం అలుముకొని ఉందో ఇప్పుడు అర్థం అవుతోంది గీతను స్కూల్లో చేర్పించడం ఎలా?

ఎవరికైనా పెళ్ళి చేసుకుందే? ఎవరు చేసుకుంటారు? చేసుకుంటే ఇంకెన్ని సమస్యలు తలెత్తుతాయో.

ఒంటరిగా పోయేదాన్ని వచ్చి పోయే జనం ఓమాదిరిగా ఆగి, ఆగి, చూస్తున్నారు. ఆమె మాత్రం వడి వడిగా నడుస్తూంది. ఎండ నిప్పుల్ని వెదజల్లుతుంది. శిరీష తట్టుకోలేక రోడ్డు పక్కన ఉన్న ఓ వేప చెట్టు కింద నిలుచుంది. ఆ చెట్టుకు కొమ్మలు సరిగ్గాలేవు. దొంగలు దోచిన ఇల్లులా ఉంది. కొంగుతో ముఖం అద్దుకుంటున్నప్పుడు ఆమె చూపు ఎదురుగా ఉన్న గ్రేవ్ యార్డ్ మీద పడింది.

చుట్టూరా చిన్న కాంపౌండ్ వాలున్న ఆ శ్మశానంలో గోరీలు, వాటి తలపైపు వాళ్ళ తాలూకు వివరాలు చెక్కబడ్డ రాతి పలకలు నాటి ఉన్నాయి. ఇక్కడ నిద్రిస్తున్న వీళ్ళకు ఏ బాధలూ, ఏ బహిష్కరణలూ లేవు కదా! అందరికీ ఇక్కడ సమానమైన చోటు గదా అనుకుంది. గేటుకు ఇరువైపులా రెండు బోర్డులు వున్నాయి. ఒకదానిపైన "నీవు మనుషులు సృష్టించే బాధలకు భయపడకుము." మరొక దానిపై- "ఆత్మబలం అన్ని సమస్యలను జయిస్తుంది." అని రాసి వుంది.

శిరీషకి కాన్వెంట్ గుర్తొచ్చింది. అక్కడి ప్రిన్సిపాల్ గుర్తొచ్చింది. ఆమె రూంలో వున్న మేరీమాత బొమ్మ గుర్తొచ్చింది టేబుల్‌మీదున్న శిలువ బొమ్మ మరీ మరీ గుర్తొచ్చింది.

వెంటనే వెళ్ళి ప్రిన్సిపాల్‌ను కల్సి, గీత పుట్టుకను గురించి వున్నది వున్నట్టుగా చెప్పి తన బిడ్డ అడ్మిషన్ ఫారం పైన తండ్రి స్థానంలో తానే సంతకం చేస్తానని నిర్ణయించుకున్న ప్పుడు ఆమె కళ్ళల్లో కొత్త కాంతి కనిపించింది.

అంత వరకూ అలసటగా ఉన్న మనసు తేలిక అయ్యింది శరీరంలో కొత్త శక్తి చేరినట్టు కాగానే గ్రేప్ యార్డ్ వైపు కృతజ్ఞతతో చూస్తు మళ్ళీ నడక ప్రారంభించింది. దగ్గర అవు తున్న నగరం అరణ్యంలా కనిపిస్తుంది. అయినా ఆమె నడు స్తూనే వుంది.



# మల్లెపూలు

ఒకప్పుడు అది పల్లె అయినప్పటికీ రోడ్డు ప్రక్కనే వుండటం మూలాన బాగా పెరిగి టౌన్ అయి తాలూకాగా మారింది. అందుకే ప్రభుత్వ కార్యాలయాలు, కరెంట్ సబ్ స్టేషన్, పోలీసు స్టేషన్ వున్నాయి. ఓ ఏడాది క్రితం నుండి కెనాల్ పని జరుగుతుండటం వల్ల ఆ ప్రాంతమంతా ప్రాజెక్ట్ ఏరియాగా మారి దానికి సంబంధించిన అఫీసులు కూడా వెలిశాయి.

ఆ ఊరు చివరలో క్రొత్తగా కట్టిన ఓ డాబా దాని చుట్టూరా వున్న ప్రహారీ గోడ లోపల పూలమొక్కలు, ఆ యింటికి రోడ్డుకానుకొని ఓ గేటు, కాని ఆ యింటికొచ్చే చాలామంది వెనక వైపు వున్న పెరటి ద్వారం నుండే వస్తు పోతుంటారు.

ఆ రోజు ఉదయం పదకొండు గంటలకు, ఓ పదిమంది మహిళా మండలి సభ్యులు ముందు గేటు తెరుచుకొని లోపలికొచ్చారు. వాళ్ళ ముఖాలలో కోపం కొట్టొచ్చినట్లు కనపడుతోంది వాళ్ళ శ్వాసలో కసికనిపిస్తోంది, అందరూ వరండాలోకొచ్చి నిలుచొని అటుయిటు చూస్తున్నారు. అక్కడ గోడకు దేవునిబొమ్మగల ఒకేఒక క్యాలెండరు వేలాడుతోంది. వరండాలోని మేన్‌డోర్ ద్వారానికి ప్లాస్టిక్ పూసల పరదావేసి ఉంది. దానికి ఒకవైపు అందంగా అలంకరించిన డ్రాయింగ్‌రూమ్ ఉంది. మరొకవైపు వున్న గది తలుపు మూసిఉంది. అందులో నుండి చందనపు వాసనొస్తోంది.

''ఎవరుఇంట్లో'' ఓ మహిళ గొంతు.

''........''

''ఈ ఇంట్లో ఎవరూ లేరా'' కాస్త గట్టిగా అంది మరొకావిడ బుజానికి వున్నవ్యానిటి బ్యాగ్‌ను సవరించుకుంటూ

''పనిలో వుండొచ్చు'' అంది వ్యంగ్యంగా స్లీవ్‌లెస్ జాకెట్ విలాసవతి.

''పగలు కూడా అదేపనా'' ద్వందఅర్థం ధ్వనించేట్లుగా అంది.

తలుపు తెరుచుకొని పూసల పరదాను ప్రక్కకు నెట్టికొని వస్తూ ''నమస్కారమండి'' అంటూ చేతులు జోడించి, అందరి వైపూ చూస్తున్న ఆమెకు, ఎవరూ ప్రతి నమస్కారం చేయకుండానే చిత్రంగా చూస్తూ నిలుచున్నారు.

"రండి కూర్చోండి" అంటు ఆమె డ్రాయింగ్ రూమ్ వైపు నడుస్తున్నపుడు ముట్టుకుంటే మైల పడిపోతామన్నట్లుగా తోవనిచ్చారే తప్ప, ఆమెను ఎవరూ అనుసరించలేదు.

ఆమె తలంటుస్నానం చేసి వెంట్రుకలను చిందర వందరగా ముడివేసి, కనకాంబరాల మాలను చెక్కుకొంది. కంఠపు భాగాన చందనం రాసుకొని, నుదుట కుంకుమ దిద్దుకున్న ఆమె ముఖం సాయం సంధ్యలా వుంది. రాగిరంగు పట్టుచీర కట్టి అదేరంగు రవికతో బ్రాలేకుండా రొమ్ములను బిగించి కట్టింది. ప్రౌఢవయసులో అమె వెలుగుతున్న దీపంలా వుంది. ఆమెనే చూస్తున్న వాళ్ళ మనసులో ఎంతో అసూయ చోటు చేసుకొన్నట్టు, వాళ్ళ కళ్ళే చెబుతున్నాయి. ఎవరూ తననను సరించడం లేదని గమనించి మయూరి వెనక్కు మళ్ళి,

"మీరు ఎవరింటికో పోవాలనుకొని నా యింటికొచ్చినట్లుంది. నా పేరు మయూరి" అంటూ అందరివైపు నవ్వు ముఖంతో చూసింది.

"మాకు నీ పేరూ తెలుసూ, నీవుచేసేపనీ తెలుసూ" అంది వెటకారంగా మహిళామండలి అధ్యక్షురాలు. అదివిన్న మయూరి చిరునవ్వు నవ్వింది.

"ఈ రోజు నుంచి ఈ ఊళ్ళో నీ పేరు వినపడకూడదు. వెంటనే ఈ ఊరు వదలి వెళ్ళి పోవాలి." కార్యదర్శి గారి

వార్నింగ్.

ఈ అనుకోని సంఘటనకు మయూరి నివ్వెరపోయి నిలుచుంది.

"నీ వల్ల మామగవాళ్ళు యిండ్లకు కూడా సరిగా రావడం లేదు.''

ఈ సారి మయూరి పడి పడి నవ్వింది. అప్పుడామె ముఖంమీద తెల్లని మేఘాలు నడచినట్లనిపించింది.

"ఈ ఊళ్లో సినిమా టాకీసులు రెండు వున్నాయి. నాలుగు బారుషాపులూ ఉన్నాయి. తెల్లవార్లూ పేకాడుకోటానికి ఓక్లబ్ కూడా ఉంది. అక్కడికి వెళ్లరా?'' అంది ఓ మాదిరిగా అందరివైపు చూస్తూ.

''వాటిల్లోకి పోతే ఒక్క డబ్బు మాత్రమే పోతుంది.'' అంటున్నావిడ మీద చూపు నిలిపింది మయూరి.

వెనక పెరటి తలుపు తట్టిన శబ్దం

"అదిగో ఎవరో రానే వచ్చినట్లుంది."
అంటూ ఒకరి ముఖాలువొకరు చూసుకొన్నారు.

"రాని, లోనికి వచ్చాక ఇద్దర్ని పోలీసులకు పట్టిస్తే" ఒకావిడ సలహా.

మయూరి తేరుకొని "అదే పని నేను చేస్తే" అన్నప్పుడు

ఆమె ముక్కుపుటలు కదిలి కళ్ళల్లో నుండి రోషం తన్నుకొచ్చింది.

ఒక్కసారే పులిక్కిపడ్డారందరూ.

"నా యింటి వరండాలో మీరు, పెరట్లో పరాయి మగాడు, ఒక్కసారి ఆలోచించి బుద్ధిగా వెళ్ళిపోండి. మరెప్పుడైనాసరే యిలాంటి ప్రయత్నం చేయకండి. ఊ, వెళ్ళండి" అంటూ లోపలికెళ్లి తలుపులు వేసుకొంది

తెల్లముఖాలేసుకుని నిలుచున్నారే తప్ప ఎవరి నోట మాట రాలేదు.

పెరటి తలుపు తెరచి-మూసిన చప్పుడు.

మయూరి కాలి మెట్టెలకు ఉన్న వెండి గజ్జల శబ్దం పక్కగదిలోకొచ్చి ఆగిపోయింది.

"ఎంతసేపు బయట నిలుచోవాలి, ఎవరైనా చూస్తే" మగగొంతు.

"పూజలో ఉన్నానండి" అంటు ఆమెచేతులు అతని భుజాలపై వేసి తనపై వంచుకొని ముద్దుపెట్టుకున్నట్లుంది. మణికట్టునుండి మోచేతుల వైపుజారిన గాజుల చప్పుడు, ముద్దాడిన పెదాల చప్పుడూ ఒకటి తర్వాత వొకటి వినిపించాయి.

“అబ్బ అంతగట్టిగా కౌగలించుకుంటే ఎలా రొమ్ములు అణిగి వెన్నుకు అతుక్కు పోవూ'' అంటూ అతని కౌగిలిలో కరిగిపోతు న్న శ్వాస చప్పుడు

''కావాలంటే పెదాలతో బుగ్గలను అదమాలిగాని, పళ్ళతో కొరకొద్దుబాబు నొప్పి పుడతది'' మత్తెక్కిన స్వరంతో “హు'' అన్నాడతడు. 

''అంత తొందర, మీ ఆవిడ వూళ్ళో లేదా''

''అదో జడపదార్థం, వున్నా లేకున్నా రెండూ వోటే''

''చ్ఛ, చ్ఛ, చ్ఛ'' 

“వొంటి మీదగుడ్డ లెందుకు తీసెయ్”



“ఆపని మీరు చేస్తేనే అందం''

అలా ఎంత సేపు గడిచిందో ఎవరికి తెలియదు. మయూరి తలుపు తెరచుకొని బయట కొచ్చినా కాని అందరు ఈ లోకంలోకి రాలేదు.

“మీరింకా యిక్కడే వున్నారా, వెళ్ళిపోయారనుకున్నా.” చెదిరిన ముంగురులను సవరించు కుంటూ అంది మయూరి.

"మేము వెళ్ళిపోయామనుకొనేనా పట్టపగలే యింత బరితెగింపు."

"మీరున్నా లేకున్నా నాపనే యిది"

"ఛీ,ఛీ తలచుకుంటే వొళ్ళు గగ్గురుపొడుస్తుంది"

"కాదు పులకరించాలి, స్త్రీ పురుషుల కలయిక ఓ అందమైన అనుభవం అని మీలో ఎందరికి తెలుసు?"

"అనుభవమా పాడా! పట్టపగలే గుడ్డలిప్పించుకోడం ఎంత పాపమో తెలుసా"

"పాపమా అదేమిటీ? స్త్రీ పురుషుల కలయిక పాపమైతే ఈసృష్టికే అర్థంలేదు. మీరెప్పుడూ మీ భర్తలకు ఇవ్వ వలసినంత శృంగారాన్నివ్వరు. కాబట్టే అదిదొరికే చోటికి పరిగెత్తు కొని పోతారు. వారు—మీరు ముద్దిచ్చుకోవడం అంటే సిగ్గు. కౌగిలించుకోవడం అంటే భయం. ఎదో పిల్లల్ని కనడం కోసం చీకట్లో కళ్ళుమూసు కుంటారే తప్ప వెలుగులో, వెన్నెల్లో భర్తలతో ఆడు కోరు. అందుకే మీభర్తలు మిమ్ముల నిష్టపడరు పసుపు రాసుకొని పట్టుచీరలు కట్టుకొని పేరంటానికెళతారే తప్ప పడక గదిలోకి మాత్రం పాతచీరలతోనే పోతారు. బొట్టు, కాటుక, నగలు అలంకరించుకొని గుడికి పోతారే తప్ప ఇంట్లో బోసిగానే ఉంటారు.

మల్లెపూలు కొనుక్కొని ఏ మ్యాటినీకో పోయేటప్పుడు తల్లో పెట్టుకుంటారు తప్ప, రాత్రి వాటిని పెట్టుకొని పక్కమీదకు పోరు. మల్లెపూలు పెట్టుకుని మగవాడి కౌగిలిలో వొదిగి పోతే అవి వాళ్ళను ఎంత మత్తెక్కించి, ఆడవాళ్ళను అతుక్కుపోయే ట్లుగా చేస్తాయో మీలో ఎంతమందికి తెలుసు? ఏది ఏమైనా మిమ్ములను చూస్తుంటే నాకే జాలేస్తుంది. రాజకీయాల్లో, ఉద్యోగాల్లో సమాన హోదా కావాలనికోరే మీరు సరసంలో, సంసారంలో కూడా సమాన హోదా కావాలని ఎప్పుడైనా కోరారా, చాకిరీ చేయడమే కాదు సంసారాన్ని స్వర్గంగా మార్చుకోడం తెలుసుకోండి. మీ అందరికీ ఓ నమస్కారం ఇక వెళ్ళచ్చు'' అంటూ లోపలికెళ్లింది మయూరి.

కొంగులతో ముఖాలద్దుకుంటూ అందరూ మౌనంగా అక్కడినుంచి వెళ్ళిపోయారు.

ఆ రోజు సాయంత్రం మయూరి ఏదో నవల చదువుతూ వరండా మెట్లమీద కూర్చుంది. అప్పుడే బజారునుండి వచ్చిన పనిమనిషి "అమ్మగారూ ఈ రోజు బజారులో మల్లెపూలు దొరక లేదు. అప్పుడే అన్నీ అయిపోయినాయట" అంటూ లోపలికి నడిచింది.

చదువుతున్న పుస్తకాన్ని మూసి, అప్పుడే పొడుచు కొస్తున్న నెలవంకను చూస్తూ తనలో తాను నవ్వుకొంది మయూరి.



# వాయిదా పడిన కేసు

రోజూ సైన్సు పాఠాలు విని, ప్రాక్టికల్స్ చేసి, చేసి బోరెత్తిన బి.యెస్సి ఫైనల్ విద్యార్థులు ఆరోజు కస్తూరిమేడం చెప్పే సాహిత్య పరమైన సంగతులు చాల శ్రద్ధగా వింటున్నారు.

"ఒక జడ్జిగారు మరణించగా ఆయన స్థానంలో తనను నియమించ వలసిందిగా ఒక యోగ్యుడైన ప్లీడర్ దరఖాస్తును సిద్ధం చేసుకుంటాడు. అయితే శవానికి యింకా దహన క్రియలు జరగలేదు. అయినాక యివ్వొచ్చు అనుకొని ఆగుతాడు. అంత్య క్రియలు ముగిసినాక తన దరఖాస్తును యివ్వడానికి వెళ్ళాడు.

ఆ స్థానంలో అప్పుడే ఒకరిని నియమించడం జరిగిందని తెలుస్తుంది. అప్పుడతను ఏడ్వలేక నవ్వలేక నిర్ఘాంతపోయి నిలుచుంటాడు. యిది నేను ఈమధ్య చదివిన ఓమంచి రచన యొక్క జిస్టే అని ముగిస్తుంది మేడమ్.

అరుణ వెంటనేలేచి "మేడం! శవంస్మశానానికి చేరక ముందే ఆ స్థానం తనకురావాలని అంటే తనకు రావాలి అని కొట్లాడుకునే వ్యక్తులు సాహిత్యంలోకాక నిజజీవితంలో ఉంటా రండి." పీరియడ్ ముగిసినట్లు బెల్ అయ్యింది. "మనిషి ఎంత స్వార్ధపరుడో మీరు నిజ జీవితంలో అడుగు పెట్టాక తెలుస్తుంది అంటూ బయటికి నడిచిన మేడంను విద్యార్థులు అనుసరించారు.

* * *

బెంచి క్లర్కు కేసుకు సంబంధించిన కాగితాలను జ<sup></sup> గారి ముందుంచి అటెండర్ కేదో చెప్పగానే అటెండర్ పబ్లి ప్రాసిక్యూటర్‌ను రావలసిందిగా పిలిచాడు.

బార్ రూంలోవున్న పబ్లిక్ ప్రాసిక్యూటర్ హడావిడిగా హాల్లోకొచ్చి కూర్చున్నాడు.

జడ్జిగారు కాగితాలను పరిశీలించి అంతవరకు తాను నోట్ చేసుకున్న పాయింట్స్‌ను సమీకరించి దాన్ని జడ్జిమెంట్ రూపంలో ప్రకటిద్దామని ముగింపు లైన్స్ రాద్దామని పెన్

కాగితంమీద పెట్టగానే—

అరుణ తరపు అడ్వకేట్‌గారు లేచి జడ్జిగారి వైపు మళ్ళి

"యువరానర్ నా క్లయింట్ తమరికేదో మనవి చేసు కుంటానంటుంది అనుమతి ఇవ్వాల్సిందిగా మనవి."

"ఆర్గ్యుమెంట్స్ అయిపోయాయిగద. యింకేమిటి మనవి చేసేది" అన్నారు జడ్జిగారు కాస్తాముఖాన్ని చిట్లించుకుంటూ.

"అప్పుడు ఆమె చెప్పుకునే సత్తువ లేకుండా పూర్తిగా నరాలు బిగుసుకుపోవడంవల్ల శబ్దం కూడా సరిగ్గా రాలేదు. యిప్పుడు కాస్తాకోలుకుంది. మాట్లాడగలుగుతుంది. దయచేసి అవకాశమివ్వండి." అంటూ బోనులోవున్న తన క్లయింటు వైపు చూసాడు.

"యస్ పరిమిటెడ్" అంటూ జడ్జిగారు రెండు చేతులను గదమ కింద ఆనించి వినడానికి సిద్ధమయ్యాడు.

వంకరపోయిన వేళ్ళతో, ఎక్కడికక్కడ కాలి, గాయాలై మాని, నరాలు గుంజుకుపోయి మెడభాగం అతుక్కుపోయి ముక్కు, నుదురు, చెంపలు, తెల్లమచ్చలయిన ఒహు వికృత రూపం. కాలి ముడుచుకుపోయిన కనురెప్పల క్రింద కాలకుండా మిగిలిపోయిన కనుగుడ్లను కదిలిస్తూ ఒక్కసారి చుట్టుచూసి

ఆ కేసును వాదిస్తున్న పబ్లిక్ ప్రాసిక్యూటర్ పై బెంచీలమీద కూర్చున్న తాళికట్టిన తనభర్త కొత్తగా పెండ్లికూతురై అత్త గారింటికి వెళ్ళినప్పుడు హారతిచ్చి బొట్టుపెట్టి తనయింటి కడప లోపల కుడిపాదం పెట్టమన్న అత్త.

పందిళ్ళు వేయించి పదిమందికి తెలిసేటట్టుగ బాజా భజంత్రీలతో ఊరేగింపు తీయించిన మామగారు కూర్చొన్నారు.

తనకు ఆర్థిక సహాయం కల్పించి తన తరపున ఓ అడ్వకేటును పెట్టించిన మహిళా సంఘ సభ్యులు కోర్టుహాలు దర్వాజ దగ్గర బెంచిమీద కూర్చున్నారు.

బోనుపక్కనే తన తల్లి నిలుచుంది. జడ్జిగారివైపు మళ్ళీ చేతులు జోడించి

"అయ్యా నేను చావవలసినదాన్ని ఎట్లా బ్రతికానో, ఎందుకు బ్రతికానో అర్థం కావడంలేదు. నాకు పిల్లలు కాలేదని గొడ్రాలునని నలుగురిలో అవమానం భరించలేక నాకు నేనే కాల్చుకొని చావాలని చూశానని అత్తగారివాళ్ళ అభియోగం దీనికి పోలీసువాళ్ళ మద్దతు నాకు చావాలని లేదండి. ఈ స్థితిలో యిప్పటికీ బతకాలనే వుంది. నాకేం తక్కువని బి.యస్సీ. వరకు చదువుకున్నాను. అమ్మా నాన్న అందమైన రూపాన్నే యిచ్చారు. కానీకాపాడి ఆనందిచాల్సిన భర్త"–

అప్పుడామె గొంతులో దుఃఖం తన్నుకొచ్చింది. కళ్ళల్లో తిరిగిన నీరు ధారలై కాలిన బుగ్గలమీద నుండి జారుతున్నాయి.

"నా నోటిలో గుడ్డలు కుక్కి నాచేతులను నాభర్త బిగ్గరగా కదలకుండా పట్టుకున్నాడు. తన కొడుకులాంటి, తనలాంటి మనవళ్ళు, మనవరాళ్లను నేను కనిపెంచుతుంటే చూసి ఆనందించాల్సిన అత్త అగ్గిపుల్లను గీసి అంటించింది.''

జడ్జిగారు కదిలి కూర్చుంటూ జారిన కళ్ళద్దాలను సరి చేసుకున్నాడు.

కోర్టులో కూర్చున్న ఆడవాళ్ల కడుపులో చెయిపెట్టి దేవి నట్లయి కళ్ళనిండా నీరు ఊరుతుంది. భర్త, అత్త తలలొంచి నేలను చూస్తున్నారు.

మానవత్వం రోధిస్తున్నట్టుగ కోర్టు హాల్లోని గడియారం టంగ్ టంగ్‌మంది. భరించరాని బాధతో సోలుతున్న శరీరాన్ని జోనుకర్రల ఆసరాతో నిలదొక్కుకొని మామగారివైపు చూసి,

"మామగారేమో దానికి మసిపూసి మాయచేసి, నేనేకాల్చుకొని చావాలని నిప్పుపెట్టుకున్నానని పంచనామ రాయించాడు. డబ్బుకు ఆశపడి పోలీసులు ఆత్మహత్యా ప్రయత్నం నేరం కింద నాపై కేసు పెట్టారు.

మనుషుల్లా పుట్టి జంతువుల్లా బ్రతుకుతున్న వాళ్లు, తమకు కూడా బిడ్డా పాపలున్న వాళ్లూ తాగుడుకు, డబ్బుకు ఆశపడి తప్పుడు సాక్ష్యాలు ఇచ్చారు.

అయ్యా నేను నిర్దోషిని, నేను బ్రతికినా సంసార జీవితానికి పనికేరానని నేను హాస్పిటల్లో వున్నపుడే రెండవ పెళ్ళికి ప్రయత్నాలు మొదలయినాయట. ఆస్తిని, ఉద్యోగాన్ని చూసి పిల్లనిస్తామని పిచ్చి తల్లిదండ్రులు అనడం, చేసుకుంటామని అమాయకపు సోదరీమణులు ఒప్పుకోవడం దురదృష్టం" అంటూ ఒక్కసారేఁరు పైన శ్వాసవొదిలి కళ్లుమూసుకుంది. అప్పుడు క్లాస్ రూంలో కస్తూరిమేడం చెప్పిన మాటలు గుర్తుకురాగా తమాయించుకొని దోషిఅయిన నా భర్తకుకూడా మీరు జైలుశిక్ష విధించవద్దు, మరణశిక్ష అసలొద్దు. నా భర్త వంద సంవత్సరాలు బతుకుతూ మళ్ళీ పెళ్ళి చేసుకోకూడదని ఆంక్ష విధించండి. ఏ అమ్మాయి ఆయనతో రెండవ పెళ్ళికి ముందుకు రావొద్దు. ఈయనకేకాదు ఈయనలాంటి నరరూప రాక్షసులకు ఎవ్వరూ మళ్ళీ పిల్లనివ్వవద్దు. అసలు ఈ అమాయకురాళ్ల హత్యలకు కారకులు అత్యాశపరులయిన అత్తామామలు. వీళ్ల కూతుళ్లకు కట్నం లేకుండా పెళ్ళిళ్ళు కావాలి. కూతురికాలికి మన్నంటకుండా ఒతకాలి కానీ కోడలు మాటలతో రావాలి. అందరికీ చాకిరీ చేయాలి లేదా చావాలి యిదెక్కడి న్యాయమో ఆలోచించండి.

ఇలాంటివాళ్ళకు జీవితాంతం కుమిలి చచ్చే జైలుశిక్ష విధిస్తే అత్యాచారాలు తగ్గొచ్చు. పోతే తప్పుడు కేసు బనాయించి అందర్నీ తప్పు దోవన పట్టించే ఆ పోలీసులను కేసు తప్పని తెలిసిన తరువాతనయినా ఏ శిక్ష విధిస్తారో!
మరో తప్పుడు కేసును ప్రతిపాదించకుండా చేయండి.

పత్రికలు కథలు చెప్పినా, సినిమాల్లో హృదయం కదిలించేటట్టు చూపించినా, రేడియోలు గోలచేసినా ఎవ్వరూ పట్టించుకోవడం లేదు. అందుకని నేను ఈ విషయాన్ని ప్రత్యేకించి చాటడానికి ఊర్లు, పట్టణాలు ఈ దేశమంతా తిరిగి అందరికి నారూపాన్ని చూపించి కనువిప్పు కలిగిస్తాను. నాపెండ్లికి మావాళ్ళిచ్చిన మొత్తాన్ని తిరిగి యివ్వవలసిందిగా ఆదేశించండి. అత్తా ఓతల్లే తన బిడ్డ మరొకరింటి కోడలే అందుకే ఈ స్త్రీలోకాన్ని నిలదీసి అడగాలని వుంది" అని అందరివైపు చూసింది.

కూర్చున్న వాళ్ళందరూ ఒక్కసారే శ్వాస వదిలారు. అరుణ భర్త నుదుటికి పట్టిన చెమటను అరిచేతితో అద్దుకున్నాడు అతని గుండె వేగం పెరిగింది.

భయంతో అత్త నోరెండిపోయింది. కాళ్లల్లో వొనుకు, తుల్లో వొనుకు మొదలయింది.

మామ పరిస్థితి అంతే వుంది.

అంత వరకు శ్రద్ధగా విన్న జడ్జిగారు ఏదో నోట్ చేసుకున్నారు.

కోర్టు హాల్లో కూర్చున్న వాళ్ళందరు ఒక్కసారే కదిలి తలనిండా కదిలే ఆలోచనలతో పబ్లిక్ ప్రాసిక్యూటర్ వైపు చూశారు.

నుదుట చిమ్మిన స్వేదాన్ని కర్చిప్‌తో అద్దుకుని, బిగ్రుగైనట్టు అనిపించిన 'టై' ని వొదులు చేసుకున్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు.

కేసు రేపటికి వాయిదా వేస్తున్నట్లుగా ప్రకటించారు.



# నిజం

ఆ ఊరు చుట్టూర కంపచెట్లు పెరగడంవల్ల ఊరు సరిగ్గా కనపడడంలేదు. ఊరి మధ్య ఓ పెద్ద పెంకుటిల్లు. దానినలుపైపుల విశాలమైన ప్రహరీగోడ ముందు నుండి పెద్దగేటు, వెనక నుండి ఓ దిడ్డి దర్వాజ. ఇంటి ముందు ఓ చింతచెట్టు.

పొద్దుపొడిచేవరకు ఊరు ఊరంతా కదిలొచ్చి చింతకింద పడి ఉన్న శవాన్ని చూస్తున్నారు.

"ఎట్లా చచ్చాడు?" ఒకరు.

"నిన్న ఉదయమే గదా ఆయన పట్టణానికి వెళ్ళింది.

రాత్రి రాగానే, ఇంట్లోకి పోకముందే ఈ దారుణం జరిగిందా?”

మరొకరు.

“అయ్యో ఇంత ఒతుకు ఒతికి యింట్లోనయినా జీవొదల లేదు. పాపం.”

ఓముదుసలి.

“పాపాలు సేయక పోతే మానపుణ్ణాలు సేసింటేడా అందు కనే ఈసావు.”

మరో ముదుసలిఅవ్వ మెల్లగ అన్నది.

భార్య తలుసుకొని తలుసుకొని ఏడుస్తూంది. చాలామంది ఆడవాళ్ళు ఆయన ఒతికి ఉన్నప్పుడు ఏడిచే వాళ్ళట.

రంగారావు అంటే ఈ ప్రాంతంలో తెలియని వాళ్ళు లేరు. ఆయన మంచి కంటే చెడే ఎక్కువ చేసేవాడు కాబట్టి, అందర్కి ఆయన గూర్చి బాగా తెలుసు. అంతటి దుర్మార్గుడు యిలా అకస్మాత్తుగా ఎలా చచ్చాడో ఎవర్కి అంతు చిక్కడం లేదు.

“నా మొగుడు చావలేదు. ఎవరో చంపారర్రో దేవుడా”— భార్య ఏడుస్తూనే.

''పామును ఎవరు చంపుతారు?'' అతని చూపుల్లో మాడి పోయిన అమాయకపు ఆడ వాళ్ళు.

గొడ్డల్లతోటి నరకలేదు కాబట్టి పాలివాండ్లు కాదు.

బరిసెల తోటి పొడవ లేదు కాబట్టి పగవాండ్లు కాదు.

కత్తులతోటి పొడవలేదు కాబట్టి కనీసం కిరాయి గుండా లూ కాదు.

అయితే ఎవరు చంపారు?

అన్న ప్రశ్నే అక్కడున్న ప్రతొక్కర్నీ వేధిస్తుంది.

రంగారావు మాత్రం చావలేదు. చంపబడ్డాడు. అన్న నిర్ణ యానికి దాదాపు అందరూ వొచ్చారు.

పెద్దతరానికి చెందిన ఆడవాళ్ళు కొందరు కళ్ళ నీళ్ళు పెడుతున్నారు.

"అవును చెడ్డవాడు చచ్చినా ఏడిచే జనం ఉంటారు గదా!" మరికొందరాడవాళ్ళు మనస్సులో అనుకుంటున్నారు.

పోలీసు పటేలు స్టేషన్‌కు రిపోర్టు రాస్తూ రాస్తు, చచ్చి పడి ఉన్న రంగారావును చూశాడు.

రంగారావు వెలకల పడి ఉన్నాడు. కొందరు

చచ్చిగూడ నిద్రపోయినట్టుంటారు. రంగారావు మాత్రం అలా లేడు.

తనకేదో తట్టినట్టుగ అనిపించగ మరి దగ్గరికి వెళ్ళి చూశాడు.

మెడపై గోళ్ళూ గిగబడిన కాట్లు, శవంపడివున్న చుట్టూరా రంగారావు చావును ఎదిరించిన పోరాటపు గుర్తులు. "ఎప్పుడు పులిలా తిరిగే రంగారావు ఈ రోజు వీధిలో ఓఫ్! కుక్క చావు అంటే ఇదేనన్నమాట!'' అనుకుంటు పోలీసు పటేలు తన పని తాను చేసుకపోతున్నాడు.

* * *

ఓ కమ్మల గుడిసె. దానిముందు చొప్పదంటు, యీత ఆకులు వేసిన పందిరి. దాని కింద ఓ నుల్కమంచం. దాని మీద చినిగిన గోనెపట్టా, ఆ మంచంకాలును ఆనుకొని పడుకున్న నల్లకుక్క. అప్పుడే గంపకింద నుండివదిలిన ఓకోడి తనపిల్లలను వెంటేసుకొని ఎదురుగా వున్న ఎనుగు పైపు నడుస్తోంది.

అది గంగులు గుడిసె తన గుడిసెముందు ఉన్న కుంపటి ముందు కూర్చోని చుట్ట కాలుస్తు యింకా యిల్లుచేరని తన పిచ్చి బిడ్డగూర్చి ఆలోచిస్తున్నాడు. పిచ్చిమాలోకం నిద్రపోయి పోయి ఎప్పుడు లేచిపోయిందో ఎక్కడ పోయిందో, ఎటు

పోయిన ఎవరిని ఏమీ అనదు తనలో తానే కుమిలిపోతుంది. ఇరుపై ఏళ్ళ బిడ్డ. ఒకరోజు పనికి పోయి వొచ్చి అనుకోకుండా మూగపోయి నిలుచుంది తిండి సరిగ తినదు. ఏడుపుతప్ప ఏం చెప్పలేదు.

అమ్మాయి ఆట పాటలు చూడలేని పాపాత్ముడు ఎవరో చేతబడి చేశారని ఊరంతా ఓ నిర్ణయానికి వొచ్చినపుడు గంగులు తన తలరాతను తిట్టుకున్నాడు.

అట్లానాలుగేళ్ళూ గడిసె, పెండ్లీడు దాటొచ్చె, పేదరికాన్ని మొయ్యలేక పిచ్చి బిడ్డను చూడలేక తనను తానే తిట్టుకుంటాడు. చనిపోయిన తన భార్య ఉంటే కనీసం బిడ్డనయినా సరిగ్గా చూసుకునేది. అనుకుంటూ కాలిన చుట్టను నేలకు వొత్తి ఆర్పేశాడు. ఏనుగు దగ్గర మేస్తున్న కోడి ఒక్కసారే అరుస్తు తనపిల్లలను తన్నుక పోవాలనొచ్చిన గద్దను తరిమింది.

"అయ్యా"

"అమ్మా దుగ్గా" అంటూ గంగులు తల పైకెత్తి తన ఎదురుగ నిలుచున్న బిడ్డను చూశాడు. అంతే అంతు పట్టని ఆనందం అతన్ని చుట్టేసింది. గుంజుకుపోయిన కళ్ళనుండి ఆనంద బాష్పాలు రాలుతున్నాయ్. తనబిడ్డ దుర్గ యింతకు ముందులా లేదు. తల స్నానం చేసింది. నుదుట బొట్టు, నవ్వుముఖం.

అచ్చం నాలుగేండ్ల కింద ఉన్న ఆ కళ మళ్ళీ ఈనాడు కనిపిస్తోంది.

నిన్న మొన్నటి వరకున్న మూగతనం యిప్పుడు మాయమైంది.

గంగులు తన బిడ్డను సమీపించి ఆమె తల నిమురుతూ నిలుచున్నాడు.

తండ్రి ఎదమీద తల పెట్టి నిల్చున్న దుర్గ కళ్ళల్లో రంగారావు కదిలాడు.

పొలంలో తన శీలాన్ని దోచుకున్నప్పుడు ఏడిచిన ఏడుపు తాను అరచిన అరపులు, ఏ మనిషికి వినపడలేదు! ఏ దేవునికీ వినపడలేదు. ఏడ్చి ఏడ్చి తననోరు మూగపోయింది. ఎవ్వరిక్కి చెప్పుకోలేని బాధ ఎదలో కదులుతూ వుండేది.

రాత్రి రంగారావు తన చేతుల్లో ప్రాణం వొదులుతున్నప్పుడు తన శీలం గూర్చిన బాధ తనను వీడి పోయింది.

చిన్నప్పుడు తల్లి కొట్టినపుడు తాను యిలాగే తండ్రి ఎదరొమ్ముున ఓదార్పు పొందేది.

ఎదురుగ కంప చెట్టు కింద తన పిల్లలను రెక్కల కింద యిముడ్చుకొని కోడి కునుకు తీస్తుంది



# పోస్ట్‌మార్టం

ఇద్దరూ సైకిల్స్ రోడ్డు పక్కన లాక్‌చేసి వాటికున్న కాగితాలను తీసుకుని చంకలో పెట్టుకొని, స్వీట్ సెంటర్‌లోకి వెళ్లి కూర్చొని —

"బాబూ రెండు కళాకంద్" అన్నాడు రషీద్. అంతే నీళ్లగ్లాసులు వాళ్ళ టేబుల్‌పైకొచ్చి నిలుచున్నాయి.

''ఇంతకీ ఈ....'' వెంకన్న

"మా పెద్దవానికి నౌకరొచ్చింది!"

"నిజమా.... సంతోషం" అంటూ షేక్‌హాండ్ చేసి, నీళ్ళ గ్లాసును అందుకొని.... కొంచెం తాగి, అక్కడే టేబుల్ మీద పెడుతూ

"ఎందులో"

"జిల్లాపరిషత్‌లో వాచ్‌మెన్"

రెండు కళాకంద్ ప్లేట్స్ టేబుల్‌మీదికొచ్చాయి. అందులో తలకిందులుగా వున్న స్పూన్స్‌ను చేతుల్లోకి తీసుకొని స్వీట్స్‌ను తింటూ—

"తండ్రి పోస్ట్‌మెన్, కొడుకు వాచ్‌మెన్" చిన్నగా నవ్వుతూ

''ఏదో నడవాలి అదీ రావడానికీ ఊ'' అంటూ రషీద్ వైపు చూశాడు.

''పోనీలే యిచ్చి ఐదనాం చెయ్యడందేనికి....''

వెంకన్న నవ్వాడు శబ్దంలేకుండా

''రెండు టీ'' అన్నాడు స్పూన్‌ను ప్లేట్లోకి వొదులుతూ

రెండు టీ గ్లాసులను తెచ్చి వుంచాడు బోయ్.

చెరో టీ తీసుకుంటు....

"యిక పెళ్ళి కూడా"

"తర్వాత పని అదే గదా...."

యిద్దరూ టీ తాగుడం పూర్తిచేశారు.

వెంకన్న పక్క కుర్చీలో పెట్టిన తన ఉత్తరాలను తీసు కుంటు ఉత్తరాలవైపు చూశాడు. అన్నింటి కంటే పైన ఓ రిజిష్టర్ పోస్ట్ లెటర్ కనిపించింది. కే. రామమూర్తి, ఇ.నెం. 7-7-77, లెనిన్ కాలనీ అని వుంది. దాన్ని చేతుల్లోకి తీసుకుని "పాపం యితను పది ఏండ్లనుండి బాధలు పడుతున్నాడు. బాగా చదువుకున్నవాడు. యిప్పటి వరకు ఏ ఉద్యోగం రాలేదు. కాల్‌లెటర్స్ కోసం ఎప్పుడు ఎదురుచూస్తుంటాడు. మరి ఈ సారి జిల్లా విద్యాశాఖాధికారిగారి నుండి రిజిష్టర్ పోస్ట్‌వచ్చింది. ఏదైనా ఉద్యోగం వచ్చిందో.... రోజూ అతను అదోలాగా అడి గినప్పుడల్లా కడుపులో దేవినట్టు అనిపిచ్చేది. నారాకకు ఎదురు చూస్తుంటాడు. త్వరగా వెళ్ళి ఈ ఉత్తరం యిద్దాం. "శుక్రియా అవుర్ ముబారక్" అంటూ లేచాడు వెంకన్న. రషీద్ కౌంటర్ దగ్గరిక్కి వెళ్లి బిల్లుచెల్లించి వచ్చేసరికి వెంకన్న సైకిల్ కదిలింది. రషీద్ తన రూట్ వైపు వెళ్ళాడు.

తాగుడు పల్ల కండలు కరిగి కడుపు లావెక్కింది. కళ్లు పీక్కుపోయి ముఖం ఉబ్బిపోయి తూలుతూ జనం మధ్యలోకి వచ్చి పెహాలను అతి కష్టంగా కదిలిస్తూ "ఏంటీ సహ్బాదా?"

ఎందుకు సచ్చాడు, బతకాలని ప్రభుత్వం మంచినీళ్లిస్తుంది. బతకమని ప్రభుత్వం రేషన్‌కార్డ్స్ యిస్తుంది. తాగమని కల్లు సారా ప్రభుత్వమే అమ్ముతుంది. చావకుంట బతకమని దవాఖానాలు పెట్టింది.'' అటు యిటూ చూస్తూ అందర్ని తోసుకుంటూ ''ఎవర్ర సచ్చింది - పిరికి సన్నాసీ, బతకలేని వాడు ప్చ్-ప్చ్.'' అంటూ శవాన్ని చూసి జనం వైపు మళ్ళీ

''మన అమ్మా, నాన్నలు మనల బతకమని ఉగ్గుపెట్టి పెంచారు. చేయి పట్టి నడక నేర్పారు. కష్టపడి చదివించారు. బతకమంటే చావడందేనికి?'' అంటూ తూలే శరీరాన్ని నిల దొక్కుకుంటు అతి కష్టంగా మాటలను పలుకుతున్నాడు. మళ్లీ శవం వైపు వంగి ముఖంలోకి చూసి తాను ఏడ్వసాగాడు ఓ తాగుబోతు. ఈయన ఉదయం లేవగానే సారాయితో నోరు కడుగుతాడు. రాత్రి పడుకునేటప్పుడు సారాయే! ఈయనకు ఆకలైనా సారాయే! దూపయినా సారాయే.

"ఎలా సచ్చాడు" వెంకన్న ప్రశ్న.

''ఉరేసుకుని'' పక్కనేనిలుచున్న పన్నెండేండ్ల కుర్రవాని జవాబు. వెంకన్న కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. పదేండ్ల నుండి తనకు ఏదన్నా కాల్ లెటర్స్ వచ్చాయా అని అడిగే మూర్తి సచ్చాడా. అయ్యెయ్యె రిజిష్టర్ పోస్ట్ వొచ్చిందే అనుకుంటు చుట్టూ చూశాడు.

ఈ కవరులో ఏముందో నిన్ను ఇంటర్వ్యూలో ఎన్నిక చేసుకోనందుకు చింతిస్తున్నాము అని కావచ్చు అనుకున్నాడు వెంకన్న.

"ఏం లెటరో" గుంపులో నుండి ఒకరు.

"ఏం లెటర్ అయితే ఏంది అసలోడు పోయాక" మరొకరు.

"యిప్పి చూడండి."

"ఇది రిజిష్టర్ లెటర్ ఎకనాలెడ్జ్‌డ్యూ— ముందు పార్టీ సంతకం కావాలి."

"సచ్చినాక సంతకం" అంటు తన అనుమానాన్ని వెలిబుచ్చాడు.

వెంకన్న ఇరవై ఐదేండ్ల సర్వీసులో ఇలాంటి సమస్య ఎప్పుడూ ఎదురు కాలేదుతనకు.

అవును అదీ నిజమే అని అందరూ గుస గుస అనుకున్నారు. గుంపులో నుండి వొకరు వొంచి వదిలిన వెదురుబద్దలా లేచి వెంకన్న దగ్గరికి వస్తూ

"ఏమయ్యా, పోస్ట్ బాబూ సంతకానికి ఛస్తే ఏం, బతికితే ఏం కావల్సింది మనకు సంతకమే కదా యిట్లాతే–" అంటు

పోస్ట్‌మెన్ చేతిలోని కవర్‌ని లాక్కొని ప్రక్కవాడి జేబులోని పెన్ తీసుకుని శవం దగ్గరికి వెళ్ళి అతని అద్దుడు వేలుకు యింకు పూసి ఎకనాలెడ్జ్ రిసీట్‌పై ఒత్తి, చాలుగద యిది ఆయన సంతకమేయిక యిప్పండి" అంటుతీసుకున్న పెన్‌ను ప్రక్కనేనిలుచున్న మునిసిపల్ బిల్‌కలెక్టర్‌కిచ్చి ఎండిపోతున్న పెదాలను నాలికతో తడుపుకుంటు నిలుచున్నాడు ఈ ఐడియా ఒకతాగుబోతుకు తట్టినందుకు అందరూ ఆశ్చర్యపోయారు. వెంకన్న ఏమన లేక బొమ్మలా నిలుచున్నాడు.

కవర్‌విప్పి చదవసాగాడు.

సర్,

సబ్‌జెక్ట్—

రెఫరెన్స్— మీ దరఖాస్తు తేది 1-1-1985

పై సబ్‌జెక్ట్‌ను అనుసరించి మీ దరఖాస్తు పరిశీలించి, మీ విద్యార్హతలను గుర్తించి, మిమ్ములను ప్రత్యేకస్కేలు ఉపాధ్యాయులుగా కన్‌సొలిడేట్ పే రూ. 398/- లో నియమించడం జరిగింది. కావున వెంటనే పనిలో చేరేనిమిత్తం మా కార్యాలయానికి రావల్సిందిగా కోరవైనది.

జిల్లా విద్యాశాఖాధికారి

శవం పక్కనే కూర్చున్న ముదుసలి తల్లి "కొడుకో నీకు ఉజ్యోగం వచ్చిందిరో" అంటు గొల్లున ఏడ్చింది. ఆమె ఏడ్వగానే మరెందరో ఆడవాళ్ళు ఏడ్చారు. తల్లి ఏడుస్తు మాటిమాటికి కొడుకు ముఖాన్ని చూస్తూ దేవుళ్లను తిడుతుంది. తన కడుపున ఆ కొడుకును పుట్టించినందుకు వాణ్ణి పెంచడంలో ఎదురైన కష్టాలు గుర్తుచేసుకుని తిడుతూవుంది. పుట్టగానే తన భర్తను తీసుకుపోయి యిన్ని కష్టాలపాలు చేసినందుకు మరీ మరీ తిడుతుంది. వెంకన్న శిలలా నిలుచున్నాడు. ఈ ఉత్తరం ఒక్కరోజు ముందొస్తే మూర్తి బతికేవాడుగదా అనుకున్నాడు.

శవానికి ఉద్యోగం వచ్చినందుకు నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు. అయినా ఉద్యోగం రానంత మాత్రాన మూర్తి ఎందుకు చావాలి?

"పాపం చదివేటప్పుడు ఎంతో కష్టపడ్డాడు. రోజూ న్యూస్ పేపర్లు పంచేవాడు, సోడాబండి నడిపేవాడు. తిరిగి స్కూల్ టైమ్‌లో స్కూల్‌కెళ్లేవాడు. బిడ్డనికి బతికినన్నాళ్ళూ కష్టాలే" అన్నాడు పక్కనే నిలుచున్న ఓ నడివయస్సు వ్యక్తి, ఈయనకు మెయిన్ బజార్లో పాన్‌షాప్ వుంది.

"పేద కొంపలో పుట్టినాక కష్టాలు తప్పవు వాటిని తట్టుకోవాలి" వెంకన్న

"ఏం తట్టుకోమంటారు. కనీసం పూటైనా గడవదాయె.."
ఒకరు.

"కట్టెలు కొట్టయినా బతకొచ్చు, కంకర కొట్టయినా బత కొచ్చు, సచ్చి ఏం సాధించాడు ముసలమ్మను ముంచి పోయిండు." అంది మరో ముసలమ్మ

"ఆ పనీ చేసేవాడు, కానీ ఆ చదువుంది చూశారూ ఆ ఎం.ఏ. ఏ పనిచేయాలన్నా అడ్డొచ్చి కొంత...." అంటు బరువైన గుండెతో వెంకన్న ఆక్కడి నుండి కదిలి—

పోస్ట్‌మార్టమ్ చేయించడానికి వొస్తున్న పోలిస్ వాళ్ళవైపుచూస్తు "అసలు పోస్టుమార్టం వల్ల ఎలా చచ్చాడో తేలుద్ది కానీ ఎందుకు చచ్చాడన్నది తేలదు కదా!?" అనుకుంటు తన సైకిల్ వున్న వైపు నడిచాడు.



# మబ్బులు

ఆవూరి చెరువు ఎండిపోయింది. చెరువులో నీళ్లుండేనే, అక్కడి బావుల్లో నీరు. భూములు బీటలు బారినాయి. పంటచేలు ఎప్పుడోపాడైపోయినవి.

జనం మైళ్ళకొద్ది దూరం పోయి, కుండలలో నీళ్ళు తెచ్చి, తెచ్చుకోలేనివాళ్ళకు అమ్ముకుంటున్నారు. కొందరు మంచినీళ్ళకు బదులు కల్లు తాగి కూడా ఉంటున్నారు. కల్లు రెండింటికీ పని చేస్తోంది. ఒకటి ఆకలికి, రెండోది దాహానికి. జనం ఆకలినిమరవడానికి సారా కూడా తాగుతూ, సారా త్రాగడానికి అప్పులు చేస్తున్నారు. ధాన్యంధర పెరగదు. కల్లుసారాధరలుమాత్రం ప్రభుత్వమే పెంచేస్తోంది. అయినా తాగేవాళ్ళు తాగుతూనె ఉన్నారు.

ఆది వర్షాకాలమైనా, ఎండకాలంలా ఉంది. జనం చెట్ల నీడన చేరి "వర్షాలు ఎందుకు రావడం లేదోనని" చర్చిస్తున్నారు. ఇప్పటివరకు గడిచినా, ఇంక ముందెట్లా గడుస్తుందోనని ఆలోచిస్తున్నారు.

కప్పలకు పెండ్లిచేసి, ఆడవాళ్ళు పాటలుపాడుతూ ఊరంతా తిరుగుతున్నారు.

ఈ పరిస్థితుల్లో గ్రామ పంచాయతీ మీటింగు పెట్టి, పరిస్థితులనుచర్చిస్తున్నారు. ఆ గ్రామపంచాయతీ సభ్యులు

సర్పంచ్ చంద్రరావు "వర్షాలు లేక గ్రామ పరిస్థితి ఎలా ఉందో అందరికీ తెలిసిన విషయమే. ప్రభుత్వం వాళ్ళిచ్చిన గడ్డి అందరికీ పంచడం జరిగింది. కరువు నివారణ కింద ఇచ్చిన పనులు పూర్తి చేయించడం జరిగింది. రెండు బోరింగులను కూడా వేయించడం జరిగింది. మన వూరి దురదృష్టం, వాటిల్లోను నీరు పడలేదు. అంతేకాదు. నేను సర్పంచ్‌గా ఉన్నప్పుడే ఈ కరువు రావలెనా?

దీన్ని బట్టి నేను దురదృష్టవంతునిగానే భావించుకుంటున్నాను. ఊళ్ళో జనం కూడా నానారకాలుగా మాట్లాడ్డం నేను విన్నాను. పాపం పెరిగి పోయిందట, చిన్నా-పెద్దా బేదం లేకుండా పోయిందట. ఆడ-మగ తేడా లేకుండా పోయిందట. పెండ్లి కాక ముందే కడుపు చేసుకుంటుండ్రట. ముండరాళ్ళు కడుపు తీయించు కుంటుండ్రట మొన్న చనిపోయినామె గర్భవతి అని, ఆమెను అలాగె పాతి పెట్టడం వలన వర్షాలు

రావడం లేదట, అసలు ఎవరో మంత్రగాడు వర్షం రాకుండా కట్టు కట్టాడట. ఇన్ని జరుగుతున్నా, నేను ఏమి పట్టించుకోవడం లేదట. అంతేకాదు మనసభ్యుల్లో కూడా కొంతమంది మీటింగ్ పెట్టుకొని, రాధాబాయి గారిని సర్పంచ్‌గా చెయ్యాలని నిర్ణయించుకున్నారట. అవిశ్వాస తీర్మానం నెగ్గడానికి, కావలసిన సభ్యుల బలం ఆమె వైపు కనిపిస్తూనే ఉంది కాబట్టి నన్ను దించేసినా, నేనే దిగిపోయినా, ఈ పరిస్థితుల్లో రెండూ ఒకటే, అందుకని నా రాజీనామాను ఆమోదించవలసిందిగా కోరుతున్నాను'' అంటూ చంద్రరావు కూర్చున్నాడు.

రాజీనామా ఆమోదిస్తూ, రాధాబాయిగారిని సర్పంచ్‌గా ఎన్నుకుంటూ, తీర్మానాన్ని వ్రాయించారు. పంచాయితీ బోర్డు పరిచారకుడు తెచ్చి తమ తమ ఎదుట రిజిస్టర్ ఉంచినపుడు సంతకాలు చేస్తున్నారు. వేలి ముద్ర వేసే వాళ్ళ కోసం యింక్‌పాడ్‌ను, సంతకం చేసే వాళ్ళకోసం ఓ పెన్నును, రిజిష్టరుతో పాటు మోసుకుపోతున్నాడా పరిచారకుడు.

అందరితో పాటు రాధాబాయి సంతకం చేసి లేచి "నా మీద ఉంచిన ఈ బాధ్యతను సరిగ్గా నెరవేర్చడానికి మీ అందరి సహకారాలు ఉంటాయని, ముఖ్యంగా మన గత సర్పంచ్ చందరావుగారి సలహా సహకారాలు లేకుంటే నడపలేనని, వారి దయ తప్పక నామీద, ఈ ఊరిమీద ఉండాలి" అని రెండు చేతులు జోడించి చంద్రరావు వైపు మళ్ళింది. అందరూ చప్పట్లుకొట్టారు.

చంద్రరావు చిరునవ్వుతో సర్పంచ్ స్థానం నుండి లేచి రాధాబాయి కూర్చున్న కుర్చీవద్దకు వచ్చి, ఆమెను సర్పంచ్ స్థానంలో కూర్చోమ్మని చేయితో ఆ కుర్చీని చూపిస్తూ, కళ్ళతో సైగ చేశాడు. ఐదున్నర అడుగుల విగ్రహం- నిండా నిండిన సంతోషాన్ని కళ్ళు ప్రకటిస్తుండగా, ఆనందంతో అడుగులేస్తు, ఆడ తనాన్ని దాయలేని పైటను గుంజి, గుంజి కప్పుకుంటూ, వెళ్ళి అధ్యక్ష స్థానంలో కూర్చుంది.

మళ్ళీ చప్పట్లు....

పదవీ బాధ్యతలు తీసుకున్నట్లు సంతకాలు చేసింది.

ఆమె కట్టుకున్న పోచంపల్లి పట్టుచీరలో ఎంతో పొంకం గా వుంది. తెల్లని నుదుట పెట్టుకున్న ఎర్రని కుంకుమ బొట్టు ఆమె ముఖానికి అందాన్ని ఇస్తూనే, దాని కదే ఓ కొత్త అందాన్ని సంతరించుకుంది.

ఆమె అందరివైపు ఒక్కసారి చూసింది. "ఆ చూపులు మత్తెక్కించే మంత్రాలు" పైసలు చల్లి పంచాయతీ సభ్యునిగా ఎన్నికైన ఆ ఊరి షావుకారి శంకరయ్య ప్రక్కనే కూర్చున్న సభ్యునితో చిన్నగా అన్నప్పుడు, అవును అన్నట్టు తల ఊపుతూ, ఆ సభ్యుడు ఆమెవైపే చూస్తున్నాడు. అందరికీ

కృతజ్ఞతా పూర్వకంగా చేతులు జోడిస్తూ లేచి ముసి ముసి నవ్వులతో ప్రొద్దు తిరుగుడు పూవులా తిరిగింది. ఆ నాటి సభ ముగిసింది.

* * *

అదే రాత్రి రాధాబాయి ఇంట్లో ఓ గదిలో తన వర్గం సభ్యులందరికి సారా, కోడి వేపుడు అందిస్తూ ఉంది ఆ పూట ఏ సభ్యునికి ఆ ఊళ్ళో కరువున్నట్లు గుర్తులేదు. వాళ్ళు తమను తామే మర్చిపోయే ఖాళీ అవుతున్న గ్లాసులను మాత్రం గుర్తుంచు కుంటున్నారు. కిరోసిన్ దీపం కాంతిలో సారా జాడీ దగ్గర తాను స్వయంగా కూర్చొని, సారా నింపి ఇస్తుంది.

అమాయకత్వానికి ప్రతినిధి అయిన ఆమె భర్త వంట గదిలో ఉండి కోడి వేపుడును మోస్తు, మధ్య మధ్య సిగిరెట్లకూ అగ్గిపెట్టలకూ బయటకు వెళ్ళివస్తున్నాడు. పిల్లలు లేని ఆ యింట్లో వేరే సందడి లేదు, సారా తాగకుండా, తన కోసం తెప్పించిన బీరును మాత్రమే తాగుతున్న షావుకారు శంకరయ్యకు ఇంకా నిషా ఎక్కలేదు. అతని చూపులన్ని ఉండవలసిన చోటనే ఉన్నాయి. గ్లాసు నింపి ఇస్తున్నప్పుడల్లా ఓ చేత్తో గ్లాసును అందుకుంటూ మరో చేత్తో గాజులను తాకకుండా ఆ పై భాగాలనూ తాకుతూ తన్మయత్నం పొందుతున్నాడు. ఇక్కడ ఓటు యివ్వడమే గాకుండా, ఏన్నో ఏండ్ల నుండి ఆమె చేసే సారా వ్యాపారానికి పెట్టుబడి పెడుతూ వస్తున్నాడు. అసలు

తప్పకుండా యిస్తు మిత్తి కింద తాను వస్తూ పోతూ ఉంటుంది. షావుకారే కాకుండా, అందరూ ఏదో చెప్పలేని అనందంతో మునిగి తేలుతున్న నవ్వులు, అక్కడ కోరికలు కొల్లాడుతున్నాయి. చూపులు తోవ దప్పుతున్నాయి. సైగలు సిగ్గు విడుస్తున్నాయి. స్పర్శలు తావులు తప్పుతున్నాయి. ఉన్నట్టుండి దీపం చిన్న దైంది. అంతమత్తులో ఉన్న ఆ గదిలోని, మగవాళ్ళను కొన్ని గాజుల చేతులు చిత్తుచేస్తున్నాయి. వెలుతురు సరిగ్గాలేని ఆ గదిలోకి వచ్చిన వాళ్ళెవరైంది గుర్తించడం ఇతరు లెవ్వరి కైనా తెలవడం కష్టంగానీ, వాళ్ళను అరంజ్‌చేసిన రాధాబాయికి మాత్రం తెలిసే ఉంటుంది.

రాధాబాయికి ఇంకా చాలాచాలా విషయాలు తెలుసు. ఆమె పల్లెకాకుండా, పట్టాణాలు కూడా తిరుగుతుంది. కాబట్టి పట్న వాసపు ట్రిక్కులు తెలుసు. అమె కొన్నేండ్ల నుండి సారా కాంట్రాక్టు చేస్తుంది. కాటట్టి ప్రభుత్వపు కార్యాలయాలలో పని ఎలా ఏమిఅనేది తెలుసు. పైరవీలను ఏలా నెగ్గించుకోవాలో తెలుసు.

''నమస్కారం! సార్! నేను రాధాబాయిని సంఘసేవకు రాలిని'' అంటూ ఆఫీసర్ల గదుల్లోకి పురి విప్పిన నెమిలిలా నడిచి వస్తుంటే చేయి లేవడం తప్ప నోట మాటరాదు వాళ్ళకు.

"కూర్చోవచ్చాండీ" అంటు కొంగు సవరిస్తు పేర్చిన

బతకమ్మలా ఎదుటి కుర్చీలో కూర్చున్నపుడు, గదిలో స్విచ్ నొక్కితే వెలుతురు పరుచుకున్నట్లుగా, కూర్చున్న కుర్చీకాదు ఎదుటి టేబుల్ చుట్టూర, ఆఫీసర్ ముఖం నిండా, చివరికి అక్కడ నిల్చున్న బంట్రోతు కళ్ళనిండా అందం, ఆనందం పరుచుకుంటుంది.

"ఈ పనిని మీరు తప్పక చేసి పెట్టాలండీ" అంటూ, ఆమె నవ్వే నవ్వుకు, తట్టుకోలేక ఫైల్ తెమ్మని చెప్పటం కోసం టేబుల్ మీది కాలింగ్ బెల్‌ను నొక్కుతూ, ఆ బెల్‌వైపే చుస్తున్నప్పుడు, దాని నిక్కల్ మెరుపులో ఆమె నవ్వుముఖమే........

"మీ రెట్లంటే అట్లనే. తీర్థం....తీర్థమే, ప్రసాదం....ప్రసాదమే'' అంటూ చెప్పును వదిలిన ఆమె పాదాన్ని టేబుల్ కింద నుండి ఆఫీసరు కాలు కిందికి చొప్పించినపుడు, శరీరం అదుపు తప్పుతూంటే, నిలతొక్కుకోవడానికి కుర్చీలో వెనక్కు వాలి, పైన తిరిగే ఫ్యాన్ వేపు చూసినపుడు ఆ ఫ్యాన్‌కింది స్టీల్ భాగంలో ఆమె జాకెట్ వదిలిన భాగాలు కనిపిస్తుంటే, ఏ పనికాదు? అర్జంట్ పనులు అతి ముఖ్యమైన పనులున్నప్పుడు, డాగ్ బంగ్లాలో బస చేస్తూ ఉంటుంది. సినిమా హాల్లో పక్కన కూర్చొని టైం పాస్ చేస్తూవుంటుంది. నవ్వుతూ, నవ్విస్తుంటుంది. తాగుతూ, తాగిస్తూ, తింటూ తినుపిస్తూ ఉంటుంది— అమె ఏదిచేసినా పని చేసి పెట్టమంటుందే కానీ పైసలు కోరదు. పనికిరాని వాళ్ళవైపు కూడా చూస్తుంది. నవ్వుతుంది. మాట్లాడుతుంది. కానీ కలిసి నడవదు. కలవమని చెప్పదు. ఎప్పుడో చిన్నప్పుడు కొంచెం

చదివిన చదువుకు, పది మందిలో తిరిగిన అనుభవం తోడై వార్తాపత్రిక చదవడానికీ నలుగిరితో మట్లాడటానికి వీ లైంది ఆమెకు. ఇప్పుడామె గ్రామ సర్పంచ్.

రోజు తాగే రాధారాయి, ఈ రోజు తాగలేదు. తాను సర్పంచ్ అయిన సంతోషాన్నికూడా తాగలేదు. ఆమె తలనిండా ఏవేవో ఆలోచనలు, తెల్లారేముందు అందర్నీ వాళ్ళ వాళ్ళ ఇండ్లకు పంపి, గడియ వేసుకునిపడుకుంది. కానీ నిద్రఎప్పుడో తేలిపోయి దాని స్థానే, తాను ఊరికి ఏదన్నా చెయ్యాలన్న ఆలోచనలే.

ఈ ఊరికి బడి తెప్పించగలను. కరెంటు తెప్పించగలను. ఈ రెండింటి వల్లా ఊరి బ్రతుకే మారుతుంది. కానీ ఇప్పటి కరువు తీరేదెట్లా? 'వర్షం కురిసేదెట్లా?' గుడి కట్టించడం చంద్రరావే చేశాడు. వర్షం కురువాలని పూజలు, సాకలు పోయించడం, హరికథలు చెప్పించడం, అంతా ఆయనే చేశాడు. వెనకటి నుండి వచ్చే ఆచారాల ప్రకారంగా, వర్షాలు కురవనపుడు చేసే పని ఒకటి మిగిలి ఉంది. దాన్ని తాను చేయిస్తే సరి. కానీ చాలా కష్టంతో కూడిన పని అనుకుంటూ నిద్రలోకి జారుకుంది.

* * *

నెలరోజులు గడిచినా వర్షాల్లేవు. ఊళ్ళోజనం పూట గడవక పస్తులతో చస్తున్నారు. మంచి నీళ్ళ విషయం సరేసరి.

ఊళ్ళోకోళ్ళు, మేకలు, గొఱ్ఱెలు అన్నీపట్టణానికి తరలిపోయినవి. కుదవబడ్డ నగలు తెగనమ్మ బడ్డవి. యివన్నీ మాత్రం ఎన్ని రోజులు సరిపోతాయి. ఇంత కరువు గతంలో ఎన్నో సంవత్స రాల క్రింద తప్ప, ఈ మధ్య ఎప్పుడూ రాలేదని, పెద్ద వయసువాళ్ళు చెప్పుకుంటున్నారు. అన్నింటి కంటే నీళ్ళదే పెద్ద సమస్య అయి కూర్చుంది.

బోరువెల్స్లోనే నీటి జాడలేదు. అందువల్ల బావి తవ్వించే విషయం మరచి పోవల్సి వచ్చింది. జిల్లా నాయకులతోనూ, అధికార్లతోనూ మాట్లాడినా వెంటనే ఫలితం కనిపించలేదు.

ఊరంతా డప్పు చాటింపు వేయించి పూజలు జరిపిస్తూ నే వుంది. సాకలు పోయి వస్తూనే వుంది. ఈ వర్షం కోసం జరిపే ప్రతి కార్యంలో కులమత భేదం లేకుండా, ఆడ, మగ అందరూ సహకరించవలసిందిగా కోరుతూ వస్తుంది.

సిద్ధాంతులను పిలిపించి, పంచాంగం చూపించింది. పం డితులను పిలిపించింది. సలహాలను అడిగింది. అనుకోకుండా హైద్రాబాదుకు వెళ్ళొచ్చి, ఆ రాత్రికి వరదరాజుల గుడి దగ్గ రకు రావల్సిందిగా తనకు సన్నిహితులైన స్త్రీలకు చెప్పింది.

మరునాడు ముగ్గురుగాక మరో ఇద్దరూ వాళ్ళంతట

వాళ్ళే వచ్చారు. మూడవనాడు ఈ రెండు రాత్రులు జరిగిన సంగతి మరి కొందరికి తెలిసింది కాబోలు ఆ రాత్రి ఏడుగు రొచ్చారు.

తెల్లారి చాలామంది స్త్రీలు రాధాబాయిని కలిసి మాట్లాడారు. ఊరంతా ఒకటే గుస గుస. ఆ రోజు ఆకాశం మబ్బు చేసింది. జనం కళ్ళల్లో కొత్త ఆశలు మెరుస్తున్నాయి.

మొదటిరోజు గుడిచుట్టూ, రెండోరోజు కాలువల్లో, మూడవ రోజు దున్నిన నాగలి చాళ్ళల్లో, బావి చుట్టూ, కుంటల్లో, చెరువుల్లో, ఏడవ రోజు మళ్ళీ వరదరాజుల గుడి ఎదురుగ....

ఆ రోజు వెన్నెల పిండారబోసినట్టుంది. మధ్యలో రాధాబాయి చుట్టూర తలంటు స్నానం చేసిన మిగతా స్త్రీల తల వెంట్రుకలు భుజాల మీదుగా జారి, వీపు కింది భాగాన వేలాడుతున్నవి. ఎవరి వంటి మీద నూలుపోగు కూడా లేదు. చెక్కిన శిల్పాల్లా వాళ్ల నగ్న శరీరపు ఎత్తు ఒంపులు వెన్నెలలో మెరిసి పోతున్నాయి. గాలి తాకినప్పుడల్లా పులకరించిపోతూ, మబ్బులు చూస్తున్నాయని సిగ్గుపడి పోతూ, కళ్లు మూసుకుని జపం చేస్తున్నారు. ఈ రాత్రి ఈ వెన్నెల కురిసినట్టే, రేపు వర్షం కురవాలని వాళ్ల కోరిక. ఆ రాత్రంతా అలాగే గడిపారు.

మరునాడు సూర్యోదయం అయినట్టు లేదు. ఆకాశం నిండా మేఘాలు, ఉరుములు, మెరుపులు, వర్షం! వర్షం!!

ఎడతెరపిలేని వరదతో. వాగులు వర్షంతో కుంటలు, చెరువులు నిండాయి. జనం ఇంట్లో నుండి బయటికొచ్చి వర్షంలో తడుస్తూ, ఒకరితో ఒకరు సరసాలాడుతూ, తమ తమ సంతోషాన్ని వెలిబుచ్చుకుంటున్నారు. పిల్లలు వర్షంలో తడుస్తూనే ఆడుకుంటూ, చూర్ల క్రింద నిలుచుని కాగితం పడవలను వదులుతున్నారు. కొందరు కురుస్తున్న ఇండ్లల్లోనినీళ్ళను బయటకు తోడి పోస్తున్నారు.

రాధాబాయి గొడుగు పట్టుకొని ఇల్లిల్లు తిరిగి తన సంతోషాన్ని వ్యక్తం చేస్తూ ఇతరుల సంతోషంతో పాలు పంచుకుంటుంది. ముఖ్యంగా ఆ ఏడు రోజులు తనతో సహకరించిన ముత్తయిదువులను మెచ్చుకుంటూ, కన్నెలకు కనుగీటుతూ ఒకటే గుసగులు, గిల్లు కోవటాలు.

మధ్యాహ్ననికిగాని వర్షం తగ్గి ముసురు మొదలయ్యింది. ఆరోజు ఆమె సారా బేరం కూడా చాలాబాగా బాగా సాగింది.

ఓ చేత్తో గొడుగు పట్టుకుని మరో చెత్తో పంచపైకెత్తి పట్టుకొని షావుకారి శంకరయ్య మెల్లగ రాధాబాయి యిల్లు చేరాడు. వర్షపు చిత్తడివల్లా వొల్లంత చల్లగనిపించిన మనస్సుల్లో వెచ్చ వెచ్చని కోరికల ఒల్లు విరుపులు.

◆ ◆ ◆

హైద్రాబాద్‌లోని ఓ ఫైవ్‌స్టారు హోటల్లోని ఏ.సి రూం.లోని టీపాయ్‌మీద తాగి వదిలిన గ్లాసుల్లోని ఐస్ ఇంకా కరుగుతూనే ఉంది. ట్యూబ్ వెలుతురు లాగే తెల్లని ఫోంబెడ్ మీద ఒకరి కౌగిలిలో మరొకరు

"ఎప్పుడు వర్షం వస్తుందో! ఇంత కరెక్టుగా ఎలా చెపుతారండీ?'' అంటూ ఆమె తన చూపుడు వేలితో అతని పెదాలపై దరువేసినట్టు మెత్తగా కొడుతూ అడిగింది.

''రుతుపవనాల ప్రయాణవేగాన్ని బట్టి ఎప్పుడు వర్షం రానుందో గూడా, నిర్ణయించి చెప్పగలం'' అంటూ ఆమె పైకి వంగి పెదాల మీదా ముద్దు పెట్టుకున్నాడు.

"అబ్బా ముద్దా? ముద్దెరా!"

''అద్దిన వాడికెలా తెలుసుతుంది'' అనగానె తన మునివేళ్లతో అతని పెదాలనుమూస్తు

"మొత్తం మీద మీ-పుణ్యమా అంటూ మా ఊళ్ళోనే కాదు. మా ఏరియాలోనే నా విలువ పెరిగి పోయింది.వచ్చేసారి పంచా యతీ ఎన్నికల్లో మండలానికి ప్రెసిడెంట్ నేనే" అంటున్న రాధాబాయి కళ్ళల్లో కొత్త ఊహలు కదిలాయి.

తన ఊరు' ఆ ఊరి ప్రజలు గుర్తు రాగా, "వట్టి ఎడ్డి

మాలోకం” అనుకుంటూ తనలో తాను నవ్వుకుంది.

తీయగ తనలో తాను నవ్వుకుంటున్న ఆమెనే చూస్తూ-

“హూ” అంటూ కనుబొమ్మల్ని పైకి కదిలిస్తూ ఆమె రవిక ముడిని విప్పుతు-

“ఏదీ అక్కడ మీ ఊళ్ళో వర్షం కోసం’ రాత్రులలో ఏ భంగిమలో........

ఇక్కడ ఈ రాత్రి నాకోసం కూడా....” అంటూ ఆమె చీర కొంగును లాగుతున్నాడు, వాతావరణపరిశీలనశాఖ డైరక్టరు రంగనాధన్.

టీ పాయ్ మీదున్న గ్లాసుల్లోని ఐస్ పూర్తిగా కరిగి పోయింది.

# వైకుంఠపాళి

కిటికి దగ్గర కూర్చొన్న వెంకట్రామయ్య ఆలోచనలు రైలు కంటే వేగంగా పరిగెడుతున్నాయి. కంపార్టుమెంట్‌లో కూర్చున్న జనం పత్రికలు చదవడంలో కొందరు, పల్లీలు తినడంలో మరికొందరు, యింకా కొందరేమో ముచ్చట్లలో మునిగివున్నారు. ఎవరో చిన్న కుర్రవాడు శరీరమంతా దుమ్ముధూళితో కొటింగ్ లాగ వున్నవాడు చేతిలో గుడ్డ పేలికలతో కంపార్టుమెంట్‌లోని చెత్తనంతా ఒక్కచోటికి చేరుస్తున్నాడు.

రైలు పోవలసినంత వేగంగా పోవటంలేదు. దీన్ని బట్టి రైళ్ళు ఎందుకు లేటౌస్తాయో ఊహించవచ్చు.

వెంకట్రామయ్య ఒక్క కొడుకు బాగా చదివి పెద్ద ఆఫీసరయ్యి, తనకు తన వూరికి దూరమయ్యాడు. ఎప్పుడో వానికి పెద్దబ్బాయి పుట్టినపుడు ఇరువై ఏళ్ళక్రింద ఊరొచ్చి పోయాడు. వ్యవసాయ పనుల వల్ల తానురాక పదేళ్ళు కావచ్చు. అప్పుడు పెద్దోని తర్వాత దానికి ఎనిమిదేండ్లు. అదిప్పుడు పెండ్లీడుకు రావచ్చు. తనను గుర్తు పట్టుద్దో లేదో. అప్పుడే తాను చుట్ట తాగటం చూసి ' తాతయ్య పొగఃండి'' అని నవ్వేది. రాక పోకలకు వ్యవధి పట్టడం తాను ఊరువదలక పోవడమే.

పాతికేండ్ల క్రితం తనభార్య పోయినాక అన్ని బరువు భాద్యతలు, వ్యవసాయం వ్యవహారం తనొక్కడే చూసుకుంటూ వుండడం .యిల్లరికపుటల్లుని, అమాయకపు కూతుర్ని, ఆమె పిల్లలను కనిపెట్టుకొని వుండడమే అదీ కాకుండా తన కొడుకు చదువు పూర్తి కాగానే' ఆ ఇన్‌కంటాక్స్ ఆఫీసర్‌గా వుద్యోగం రావటం, ఆ వెంటనే అప్పటికి అయనను ప్రేమించిన అమ్మాయిని పెళ్లి చేసుకోవటం, పెళ్లైన కొత్తలోవొచ్చి ఊరినిచూసి విస్తుపోయి, వచ్చిన రోజు సాయంత్రమే తిరిగివెళ్ళటం, అదేమిటని అబ్బాయిని అడిగితే ఆవిడ కాలుకు మన్నంటకుండా తిరిగే మనిషి స్నానం చేయటానికి కూడా ఇబ్బందిగా ఉందట. మీరే మాదగ్గరకి వస్తు వుండండి అంటు వాళ్ళు వచ్చిన కారు కదిలి పోయింది. ఆ తర్వాత చెల్లెలు పెండ్లికొచ్చి ఆ పూటే వెళ్ళి పోయారు.

చిల్లర నాణేల చప్పుడు కాగానే, తన ఆలోచనల నుండి దృషి చప్పుడొచ్చిన వైపు మరల్చాడు.

ఎదురుగా యింతవరకు కంపార్ట్‌మెంట్‌లో తుడిచిన కుర్రవాడు. విషయం అర్థం చేసుకున్న వెంకట్రామయ్య ఓ పావలా అతని చేతిలో పెట్టాడు.

పదేళ్ళ క్రితం తన మనువడు ఇదే వయసులో వుండే. అప్పుడే ఎంతో చురకైన వాడు. యిప్పుడు కాలేజీ చదువుల్లో బాగానే వుండచ్చు. ఆ అసాధ్యురాలు మనవరాలు తాను వస్తున్నానని రాసిన కార్డు చదివి. ఏంది తాతయ్య రాత చీమల బారులాగ వుంది. అని ఎగతాళి చేసి వుండొచ్చు. నేను రైలు దిగేసరికి తల్లి తండ్రులతో పాటు వీళ్ళుకూడా స్టేషన్‌లో కారు గీరు తెచ్చి ఎదురు చూస్తువుంటారు. చాలు ఒక్క కొడుకు ఓ లెక్క మంతుడైనాడు తల్లి వుండే వీళ్ళని చూసి ఎంత మురిసేదో పిచ్చి ముండ తొందరగా వెళ్ళిపోయింది. హైద్రాబాద్ నుండి రెండు రాత్రులు ఒక దినం ప్రయాణం చేసిన రైలు అలిసి నట్టుగ వేగం తగ్గి కేక వేసి ఢిల్లీ స్టేషన్‌లో ఆగింది.

కూలీల అరుపులు, దిగేవాళ్ళ హడావిడి స్టేషనంతా కోలాహలం. చేతిసంచిని పట్టుకొని వూతకర్రను ఆనిస్తూ ప్లాట్ ఫారం మీదికొచ్చి నిలుచోని చుట్టుచూశాడు. తన కొడుకు కోడలు ఎవరూ తన కోసం వున్నట్టుగ కనిపించలేదు. లగేజి లేదని గమనించిన కూలీలు గూడ ఎవరు వెంకట రామయ్యను పలకరించ లేదు. తాను పలకరిద్దామనుకొన్నా తెలుగొచ్చినట్టుగా ఎవరిమాట వినపడటంలేదు. అందరూ హిందీ, ఇంగ్లీష్‌ల్లోనే మాట్లాడుతున్నారు. పదినిమిషాల్లో ప్లాట్

ఫామ్ ఖాళీ అయింది. తన మనవడైనా వచ్చి వుండాలి అని బయటికొచ్చి నిలుచున్న కార్ల వైపు చూసాడు. అన్ని కదలి పోతూనే వున్నాయి. ఎవరో ఓ నడి వయస్కుడొచ్చి ''ఆప్‌కా వరంగల్?'' అని అడిగాడు.

వరంగల్ మాట వినగానే ప్రాణం లేచి వచ్చి నట్లైంది వెంకట్రామయ్యకు. అవును అన్నట్లు మళ్ళీ తలవూపాడు.

''నామ్, వెంకటరావ్?'' అడిగాడు

అవును అన్నట్లు తల వూపాడు

"నమస్కార్ ఆహియే'' అంటూ అక్కడ సిద్దంగా వున్న కారును చూపించాడు.

ఇద్దరూ కారు వైపు నడిచారు.

"ఆప్ ఇందీ జాన్‌తే''

''సైజామ్ వాన్ని గదా, ఎదో వచ్చిరాని వురుదు అన్న మాట తెలుసుకోగలను''

"నేను హైద్రాబాద్‌లో కొన్నాళ్ళు టాక్సీ నడిపాను కొంచం కొంచం తెలుగు తెల్సుతది"

వాని పుణ్యం కనీసం నిసైనా పంపాడు అని అను

కుంటుంటే అనుకోకుండా పెదవుల మీద ఓ నవ్వు తన్నుకొచ్చి పెదాలు కంపించాయి. ఆ తర్వాత తన భార్య గుర్తొచ్చి కళ్ళు చెమ్మగిల్లినాయి. కారును చేరగానే డ్రైవర్ వెనక డోర్ తెరచి కూర్చోమన్నట్టు సైగ చేశాడు. వెంకట్రామయ్య కూర్చోగానే తాను తన సీట్లో కూర్చొని కారు స్టార్టు చేసి రైల్వే హద్దులు దాటి మెయిన్ రోడ్డున పడ్డాడు.

వేమయ్య ఆలోచనలు కారుకంటే వేగంగా పరుగెడు తున్నాయి. కరోల్ బాగ్ లోపల విశాలమైన కాంపౌండ్‌లో అధునాతనంగా నిర్మించబడిన ఓ అధునాతనమైన బంగళా ముందాగింది కారు. అప్పటి వరకు మొక్కలకు నీళ్ళు పెడు తున్న తోటమాలి పరిగెత్తుకొచ్చి గేటు తెరిచాడు.

కారు పోర్టుకోలోకొచ్చి ఆగింది.

కొడుకు, కోడలు, మనవడు, మనవరాలు ఎదురొచ్చి వెంకట్రామయ్యను తీసుకుపోలేదు. డ్రైవరే వెంకట్రామయ్యను తీసుకెళ్ళి గెస్టురూం చూపించి అందులో వున్న టాయిలెట్ వగైరా చూపించి, "పానీనహియే. టిఫిన్‌లాయెగా" అంటూ మెయిన్ హాల్ వైపు నడిచాడు. కొద్దిసేపటి తర్వాత పనిమనిషి కాఫీ తెచ్చి పెట్టిపోయింది. టాయ్‌లెట్ గదిలోకెళ్ళి అన్నీ ముగించుకొని వచ్చేసరికి కాఫీ చల్లారిపోయి ఆలాగే ఉండి పోయింది.

అమ్మగారు వస్తున్నారు

"నమస్కారం మామగారు అంతాబాగున్నారా?" అంటు కోడలు వొస్తుందనుకుంటే ఆమె దర్పంగా, విలాసంగా వచ్చి ఎదుటి సోఫాలో కూర్చుంటు "ట్రైన్ లేటొచ్చినట్టుంది అయినా మా డ్రైవర్ బాగానే గుర్తించాడే" అంటూ కనుల మీదకొస్తున్న తలవెంట్రుకలను వెనక్కుసర్దుకుంది.

ఈ లోపల మనవరాలు, ఏదో ఇంగ్లీష్ మ్యాగజైన్ చదువుతూ, చదువుతూ ఆపి చేత పట్టుకొని గెస్ట్‌రూం లోనికి తొంగిచూసి

"ఒహో పొగబండి తాతయ్యా! యింకా చుట్టలు కాలుస్తున్నావా?" అంటూ తల్లి పక్కనే సోఫాలో కూర్చున్నది. అనేకంటే కూలబడింది. అంటే బాగుంటుందేమో?

వెంకట్రామయ్య ముఖం విప్పారింది. నోటమాట రాక చూస్తున్నాడంతే.

"మమ్మీ ఏంటి పొగబండి తాతయ్య అలా చూస్తున్నాడు నన్ను గుర్తుపట్టలేదా?"

"అదేంకాదు, స్వీటి ఎంత పెద్దదయింది. అని చూస్తున్నాడు" అంటూ బిడ్డ వైపు చూసింది.

'హు' అని నవ్విన స్వీటీనే చూస్తు వెంకట్రామయ్య అంత పొత్తుగ, నల్లగ వొచ్చిన వెంట్రుకలను ఎందుకు కత్తిరించారో అంటూ విస్తుపోయాడు.

అప్పుడే తల స్నానం చేసి టవల్‌తో తుడుచుకుంటు గెస్ట్ రూంలోకి ప్రవేశిస్తూ మనవడు,

"హల్లో! పూరి తాతయ్య ఎంత సేపయ్యింది వచ్చి'' అంటూ నిలుచున్నాడు.

మనవడిని చూసేసరికి వెంకట్రామయ్య మనస్సు ఆనందంతో మునకలు వేసింది. ఆ సంతోషంలో వాడన్న పూరితాతయ్య మాటను గూడ ఏం పట్టించుకోకుండా "అవునోయి పట్టణం మొగోడా మీసాలొచ్చాయే, దగ్గరికి రావోయి" అంటూ రెండు చేతులు చాచాడు.

అతను రాలేదు తల తుడుచుకోవడం అయినాక ముఖాన్ని చేతులను తుడుచుకొంటూ నిల్చున్నాడు.

వెంకట్రామయ్య ఎద పొంగి పోతుంది. తన మనవణ్ణి, మనవరాలును చూసే సరికి ప్రపంచాన్ని జయించి నంత శక్తి అతనిలో చోటు చేసుకుంది.

తన పిల్లలు ఎలా వున్నారో చూడు అన్నట్టు ఓ మాదరి దర్పంతో ముఖంపెట్టి కాలుమీద కాలువేసుకొని కూర్చుంది కోడలు.

ఎంతో ఆనందం గుండె అంచులు నిండగ. కళ్ళలో నీటి పొర అడ్డురాగా, తన చేతి సంచిలోని పచ్చి వేరుశెనగ కాయల పొట్లం తీసి మీ అత్తయ్య పంపింది'' అంటూ మనవ రాలు వైపు, మనవని వైపు చూపులు మార్చుతూ చూశాడు.

కోడలు వాటివైపు చూసి చిరునవ్వు నవ్వి '' యివి యిక్కడ రోడ్ల మీద గూడ పది పైసలు పెడితే దొరుకుతాయి'' అంది.

వెంకట్రామయ్య ఒళ్ళు జలదరించింది.

''మన పొలాల్లో పండే పంటంతా ఏమౌతుంది మామగారు, అంతా మీ కూతురు కేనా?''

"వ్యవసాయం ఏముందమ్మా ఎవరు కష్ట పడితే వాళ్ళే అనుభవిస్తారు" ఆ మాత్రం గూడా వినదలుచుకోని కోడలు "పదండి టిఫిన్ చేద్దురు నేను మీటింగ్‌కు వెళ్ళాలి అంటూ లేచి డైనింగ్ హాలు వైపు నడిచింది.''

లేవబోతున్న మనవరాలు వైపు ఓ మాదిరిగా చూస్తు "నీవు కాసేపు కూర్చో" అంటూ ఆపగా చూసి తన చూపులను మనవనివైపు మళ్ళించి ''ఒరే తాతయ్య యిలారా నీవు గూడ కాసేపు కూర్చో?" అన్నాడు.

కానీ యిద్దరూ తాతయ్య మాటలను పట్టించుకోకుండా ఆకలేస్తుంది టిఫిన్, టిఫిన్ అంటూ వాళ్ళు డైనింగ్ హాలు వైపు నడిచారు.

సాయంత్రం ఐదైంది.

''అయ్యగారు, కాఫీ తెమ్మంటారా?'' పనిమనిషి గదిలోకి వస్తు అడిగింది.

అప్పుడే కాస్త నిద్ర తీసి లేచి కూర్చున్న వెంకట్రామయ్య తెమ్మన్నట్టు తలూపాడు.

ఆమె అక్కడి నుండి కదలగానే తాను పేన్‌హాల్లోకి వచ్చి చుట్టు కలియజూసాడు.

ఎవరి అలికిడిలేదు బయటి దర్వాజ దగ్గరిక్కి వచ్చి అటు ఇటు తొంగి చూశాడు ఎవరు లేరు కాంపోండ్ మూలకున్న అవుట్ హౌజ్ వరండాలో ఓ స్త్రీ కూర్చొని గోధుమలు చెరుగుతువుంది. ఆమె భుజాల మీద ఏడేళ్ళ బాలిక వొంగి తల్లి చెవిలో ఏమో చెపుతూ వుంది. ఆ ప్రక్కనే వున్న సరివి చెట్టు మొదట కూర్చొని పన్నేండేండ్ల కుర్రవాడు చదువుకుంటున్నాడు.

''కాఫీ తీసుకోండయ్యగారు'' పనిమనిషి తాను నిలుచున్న చోటికొచ్చి అంది. వెంకట్రామయ్య కాఫీ కప్పును అందుకుంటూ ''అక్కడ మూల న వున్నదెవరు?''

మన డ్రైవర్ శంకర్ ఆయన భార్య పిల్లలు, అంది

''నీకు తెలుగు బాగానే వొస్తదే నీ పేరు?"

''నా పేరు రజియా మాది గుంటూరే మా ఆయన అయ్యగారి ఆఫీస్ లోనే డ్రైవర్

''వీళ్ళెవరు లేరు? కోడలూ కనపడటం లేదు!''

అమ్మగారు మహిళాసంఘం మీటింగ్‌కు వెళ్లారు. సందీప్ బాబేమో క్రికెట్ ఆడటానికి వెళ్లాడు. స్వీటమ్మేమో సినిమాకో, దోస్తుల యింటికో పోవచ్చు'

'' అయ్యగారు రాలేదా?'' కాఫీ సాసర్లోకి వొంచుకుంటు

"రాలేదండి''

"ఈ రోజు ఆదివారం సెలవుగదా ఎటెళ్లినట్టు!"

"నాకు తెలవదండి, ఎక్కడెక్కడ తిరుగుతరో, ఎప్పొడొస్తడో చెప్పలేము"

''తిండి. గిండి,'' ఖాళీకప్పును తిరిగిస్తూ.

అయ్యగారికి తిండికి కరువా, అయినా యింట్లో ఎప్పుడు

సరిగా తినరు. "అంటూ ఖాళీకప్పును తీసుకొని వంటగది వైపు నడిచింది.

జేబులో నుండి చుట్టతీసి వెలిగించాడు.

ఆరుదాటి ఏడుకావస్తుంది. గెస్టురూమ్ కిటికి దగ్గర కూర్చున్నాడు,

గేటు దగ్గర స్కూటర్ ఆగిన చప్పుడైంది.

ఎవరో ఓ యువకుడు స్వీటిని డ్రాప్‌చేసి, కొంచెంసేపు ఏదోమాట్లాడి, చేయివూపుతూ వెళ్ళిపోయాడు. చేతిలోని వ్యానిటి బ్యాగ్‌ను విలాసంగా వూ పుతూ, వేగంగా నడిచొచ్చేది చూసి, తాను చూడనట్టే కూర్చున్నాడు.

స్వీటీ నేరుగా తన రూంలోకెళ్ళి తలుపేసుకుంది.

తన రూంలో కొచ్చి తనతో మాట్లాడుద్దేమో అనుకున్నాడు. కానీ ఆమెరాలేదు.

అరగంట తర్వాత తానేవెళ్ళి, అమెగది ముందు నిలుచొని చూశాడు ఎంతసేపు చూసిన గది తలుపు తెరచుకోలేదు.

తలుపు తట్టి పిలవాలని పించింది. ఆపని చేయలేక వచ్చి తీనువుంటున్న గదిలో చూర్చున్నాడు.

ఎనిమిదైంది.

మళ్లీ గేటు తెరిచిన చప్పుడు కాగానే, కిటికిలో నుండి చూశాడు ముందు సందీప్ అతని వెంట అతనిలాంటి బట్టలే తొడుకున్న మరో వ్యక్తి యిద్దరు చేతిలో చేయివేసుకొని నడి చొచ్చి తనగది వైపు కూడ చూడకుండా, సందీప్ గదిలోకి వెళ్లి తలుపేసుకున్నారు. కూడా వచ్చినది ఆడపిల్లో మొగపిల్ల వాడో అనేది వెంకట్రామయ్యకు అనుమానం

మనవడు తనను పలకరించనందులకు మనస్సు చివుక్కు మంది.

పనిమనిషి రాకతో ఆలోచనలను ఆపి ఆమెవైపుచూశాడు.

''భోజనాన్ని యిక్కడికి తెమ్మంటరా అక్కడికొస్తారా?''

''కోడలురాలేదా''

''రాలేదు. అమ్మగారు వచ్చేసరికి బాగారాత్రి అవుతుంది.''

"మరి పిల్లలు తినరా."

వాళ్లిష్టం వాళ్ళకు ఆకలైతే వచ్చితింటే తింటారు లేకుంటే గదిలోకే తెమ్మంటరు. వాళ్ళతో పెట్టుకుంటే మీకు కుదరదయ్యా గారు మీరుతినండి."

"నాకు ఆకలిగా లేదు"

"అయితే పాలు, పండ్లు తెమ్మంటారా"

"అవి గూడా అక్కరలేదు"

"మీ ఇష్టం. తెచ్చిపెడతాను." అంటూ వెళ్ళింది.

వెంకట్రామయ్య ఆలోచనలు పరిపరివిధాల పరిగెత్తినవి. తన కొడుకు నిన్నటినుండి యింటికి రాలేదు. కోడలు యింటి పట్టున వుండదు' పిల్లలను సంసారాన్నంతా పని మనిషి మీద వొదిలారు.

పని మనిషి ట్రేలో కొన్ని పండ్లు, ఓ గ్లాసు నిండా పాలు తెచ్చి టీపాయ్ మీద వుంచి వెళ్ళింది.

తొమ్మిదైంది.

గేటు దగ్గర కారాగిన శబ్దం. తన గది తలుపు మూసు కొని కిటికిని గూడా ఓరగా మూసి చూస్తున్నాడు.

డ్రైవర్ దిగి గేటును తెరచి కారును లోనికి రానిచ్చి పోర్టికో కింద ఆపాడు

కోడలు కారుదిగి, జారుతున్న కొంగును సరిచేసుకుంటూ,

మత్తెక్కిన కళ్లతో కాళ్ళు తడబడుతుండగా యింట్లోకి నడిచింది. డ్రైవర్ కార్ లాక్ చేసి గేటుమూసి, అవుట్ హౌజ్ వైపు నడిచాడు. పని మనిషి ఎదురుగవొచ్చి కోడలిని మేడ మీద గదిలోకి తీసుకెళుతూవుంది.

తలుపును కొద్దిగా తెరచుకొని కోడలి వాలకాన్ని, ఆమె నడకను చూస్తున్నాడు. ఆమె పిల్లల గదులవైపు గూడ చూడకుండా తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఈ లోపల సందీప్ గదిలో నుండి సన్నని డిస్కోమ్యూజిక్ వినిపిస్తూంది.

తన కొడుకు ఇంకా రాలేరు, నిద్రా రావటం లేదు బయటికొచ్చి అవుట్ హౌజ్ వైపు చూశాడు.

డ్రైవర్ బార్య భర్త రాకను గమనించి వెళ్ళి, నీళ్ళ బకెట్ తెచ్చి పెట్టి చెంబు చేతికిచ్చి, టవల్ పట్టుకొని నిలుచుంది. అతను కాళ్ళుచేతులు కడుక్కొని ముఖం తుడుచుకుంటూ వరండాలో చదువుకుంటున్న తన కొడుకును చూస్తు తన భార్య ముందునడవగ తాను ఆమెను అనుసరిస్తూ లోనికినడిచాడు. అరగంట తర్వాత బోజనం ముగించుకొని భుజం మీద టవల్‌తో చేతిని తుడుచుకుంటు, వొచ్చి చదువుతున్న తన కొడుకు పక్క కూర్చున్నాడు భార్య అన్ని సర్దివొచ్చి మరో ప్రక్కన కూర్చుంది.

తన కొడుకు రాలేదు. ఎక్కడికి వెళ్ళిందీ ఎవరు చెప్పే టట్టు లేరు. వెంకట్రామయ్య మెల్లగా అవుట్ హౌజ్ వైపు నడిచాడు. అతని రాకను గమనించి డ్రైవర్ ఆతని భార్య నిలుచున్నారు.

వెంకట్రామయ్య కొంచెం దూరంలోనే ఉండి డ్రైవర్‌ను రమ్మనట్టు సైగచేశాడు. అది గమనించి డ్రైవర్ శంకర్ దగ్గరికి రాగా యిద్దరూ కలిసి కారు వైపు నడిచారు.

"అయ్యగారు యింకా రాలేదేమిటి?"

"నహీ మాలూమ్ సాబ్"

"నీవు ఆయన ఆఫీసుకు వెళ్లవా"

"నహీ, గవర్నమెంట్ జీప్‌కో అలగ్ డ్రైవర్ హై, మైకారు చలాతాహుం"

"సరే యింతకీ ఎక్కడకి పోవచ్చు"

తెలియదు అన్నట్టు తలవూపి చేతులు కట్టుకొని నిలుచు న్నాడు. అతనికి నలభైఐదు ఏళ్లుండొచ్చు. అక్కడక్కడ తల కూనెరిసింది.

"చూడు శంకర్ నేనే అర్జంటుగ కలవడానికికొచ్చినా,

వచ్చి ఆఫీసర్స్ క్లబ్ నెంబర్ డయల్ చేశాడు శంకర్ కలవ లేదు, మళ్లీ చేశాడు, ఎంగేజ్ సౌండ్, తిరిగిచేశాడు. ఎన్నిసార్లు చేసినా ఎంగేజ్ సౌండ్. ఫోన్ పెట్టేసి బయటికి నడిచాడు. కారు ఆఫీసర్స్ క్లబ్ ముందాపి అయ్యగార్ని వెంటబెట్టుకొని, క్లబ్ ముందున్న లాన్స్‌లోని మెర్క్యూరి లైట్ వెలుతురులో పేకాడుకుంటున్న, డ్రైవర్ల దగ్గరకి వెళ్లి నిలుచున్నాడు.

ఆడేవాళ్లు ఆటలో, ఆడనివాళ్లు పక్కపక్కనే కూర్చొని చూస్తున్నారు. అయ్యవారి డ్రైవర్ ఖాసింనుచూసి,

‘‘ఖాసీంబాయి సాబ్ హై!’’

‘సాబ్ అందర్ అయేతో’’ హి డ్రైవర్ బాహర్ రహతా ఓ డ్రైవర్ ‘‘అయ్యగారి కోసం, పూర్తి కాకముందే

“అఫీసుకు ఆవో బోలో’’ పక్కవాడేసిన ఆకును అం'! కుంటూ

“ఓ నహీ’’

‘‘నహీతో వకీల్‌కే పాస్ జావో బోలో’’ చేతిలో ఆకు తీవ్రంగా పరిశీలిస్తు పక్కకు జరుపుతూ

“ఏసాబ్,,

"మేరా ఖేల్ హోనేదేవో, బాత్‌కరింగే'' కొస్త కదిలి కూర్చుంటు శంకర్ వెంకట్రామయ్య గారి వైపు చూస్తు

"వాడు ఆటపిచ్చిలో వున్నాడు. వాడే అయ్యగారి ఆఫీసు డ్రైవర్. మీరు యిక్కడే వుండి కొంచెం అయినంక వాని ద్వారా మీరొచ్చినట్టు చెప్పి పంపండి. నేను హొయ్యేవరకు నా భార్య నిద్రపోదు. అదిగాక నేను మిమ్ముల్లను యిక్కడికి తీసుకొచ్చి నట్టుకూడ అయ్యగారికి తెలువొద్దు'' అని సరళ మైన హిందీలో చెప్పి, కారువైపు నడిచాడు.

వెంకట్రామయ్య విషయాన్ని గ్రహించాడు.

ఖాసీం చూపించలేని రమ్మీ యింకొకరు చూపించే సరికి ఖాసీం తన పేకలను కసిగ నేలమీద విసిరి బీడి వెలిగించి, ఎదురుగా నిలుచున్న వెంకట్రామయ్య వైపు ఆయన వేషం చూసి, తెలుగు వాడని గ్రహించి తాను గుంటూరు సాహెబ్ కొట్టి ''తెలుగులోనే చెప్పుతండ్రి అన్నాడు''

''శ్రీనివాసరావు కావాలి''

'మనదేవూరు, యిక్కడి కెందుకు వచ్చారు? అసలు యిక్కడికి రావాచ్చాయిది అపీసర్స్ క్లబ్ కానీ ఆఫీస్ కాదని తెలియదా? అంత అవసరముంటే ఆపీస్‌టైమ్‌కు యింట్లో కలుసు కోవాలి కానీ క్లబ్ టైమ్‌లో కలవ వద్దని తెలియదా'' అంటూ బీడి సగం కాలేవరకు దమ్ములాగి, పొగముక్కునుండి వొదలి

కాలినబీడి బాగాన్ని పక్కకు దులిపాడు.

"ప్రయత్నం చేసిన కానీ"

"కానీ కుదర లేదనకు. వకీల్లున్నారు గదయ కుదర్చ టానికీ' మళ్ళీ దమ్ములాగుతూ

"మన దేవూరు ఏంబిజినెస్"

"మాది వరంగల్"

"అంటే అయ్యగారి వూరే!

'ఆదే నేను వారి తండ్రిని"

"మరి ముందే చెప్పలేదేమండి" అంటూ చేతిలోని బీడిని పారేసి దిగ్గున లేచి ప్రక్కనే పడివున్న స్లిప్పర్స్‌ను గబ గబా తొడుక్కొని

"ఒరే భాయిసాబ్‌లు మీరు ఆడుతూ వుండండి" అంటూ లేచొచ్చి వెంకట్రామయ్య ఎదురుగా చేతులు కట్టుకొని నిలు చున్నాడు. మిగతా వాళ్ళు ఆటలో మునిగిపోయారు.

"అయ్యగారు యింటికొస్తారా?"

"చెప్పలేం నిన్నటినుంచి ఆడుతున్నారు. లేవటం లేదు"

కొంచెం విసుగ్గా

"మరి నేను వచ్చినట్లు చెప్పాస్తావా"

మాట్లాడలేదు

"ఏమనడులే వెళ్ళి చెప్పు"

ఖాసీం ఆలోచనలో పడ్డాడు. ఈ లోపల లోపలినుండి బయటి కొస్తున్న క్లబ్ బోయ్-

"ఖాసీం భాయి కాడీదేనా" అంటూ సిగరేట్ నోట్లో పెట్టుకొని వచ్చి నిలుచున్నాడు

"సాబ్‌లోగ్ ఉట్‌నేకా మోకా హై? అని అడుగుతూ అగ్గిపెట్టె అతని చేతిలో వుంచగా ఆతను సిగరెట్ ముట్టించి తిరిగిస్తె పమ్ములాగివదిలి.

"ఎక్కడ భాయి, మీ అయ్యగారి డబ్బులు బాగా పోతున్నయి. తిరిగి రాబట్టాలని ఎవర్ని లేవనియ్యడం లేదు. బాటిల్స్‌కు బాటిల్స్ ఖాళీ అవుతున్నయి. మీ అయ్యగారి టేబుల్ చుట్టు సీతాకోక చిలుకలు వాలినయి. అయ్యగారు ఎంలేస్తడు భాయి వొరద వొస్తది-పోతది'' అంటు హిందీలో చెప్పాడు

దాన్ని వెంకట్రామయ్య గ్రహించాడు.

ఎక్కువ మాట్లాడం బాగుండదని ఖాసీం వెంకట్రామయ్య వైపుసైగ చేసి, ''పదండి చెపుతాను'' అంటూ జీప్ దగ్గిర్కి వచ్చి ఆగి—

''తమరు యిక్కడ వుండటం బాగుండదు. ముందు తమరిని యింటి దగ్గర దించొచ్చి, అయ్యగార్ని కలిసి మీరు వచ్చారని చెప్పి, తీసుకొస్త పదండి'' అంటూ జీపెక్కి సార్టు చేశాడు. వెంకట్రామయ్య బుర్రలో ఆలోచనలు.

మధ్య రాత్రి దాటింది. వెంకట్రామయ్య చుట్టు వెలిగించుకొని, గేటు దగ్గర నిలుచొని కొడుకు రాక కోసం ఎదురు చూస్తున్నాడు.

— చుట్ట పూర్తిగా కాలిపోయింది. మరో చుట్టను ముట్టించుకున్నాడు. తన వూరు తన బతుకు కళ్ల ముందు కొచ్చింది.

తన తాత బాగానే బతికాడని తన తండ్రి అనగా విన్నాడే తప్ప తాను చూడలేదు. తన తండ్రి మాత్రం బాగానే బతుకుతూ తనను బతికిచ్చాడు. తాను తన తండ్రి కలిసి వ్యవసాయన్నెంతో పెంపుచేసుకున్నారు. తాను తండ్రి అయ్యేవరకే ఊళ్లోమంచిగా ఉన్న వాళ్ల సరసన చేరారు.

పొగాకు పంట బాగా పండటం మూలానా గుంటూరుకు

రాక పోకలు పెరిగాయి. అక్కడి స్నేహితుల సలహాతో తన కొడుకును మిషన్ స్కూల్లో చేర్చి మెట్రిక్యులేషన్ కాగానే మద్రాస్‌కు పంపడం జరిగింది. తన మనవడు మద్రాసులో చదువుతున్నాడని మా అమ్మా నాన్నలు ఎంతో పొంగి పోయేవారు. ఎప్పుడైనా సెలవుల్లో వస్తే వాన్ని ఒక్క క్షణం వదిలి పెట్టేవాళ్ళు కాదు. ఆవకాయ పచ్చడి, గడ్డ పెరుగు, వొద్దు వొద్దు అంటున్న వానినోట్లో కుక్కేది. వానికి కుతిక పడుద్దని' వాని తల్లి తల్లడిల్లుతూ తన దగ్గరకు లాక్కునేది. వాడు ఎవరి దగ్గరా వుండకుండా నా దగ్గరికి పరుగెత్తుకొచ్చే వాడు. వాడు కాలేజీ చదువు వరకొచ్చినప్పటికి, ఇంట్లో అందరూ చిన్న పిల్లాడిలాగ గారాబం చేసేవాళ్ళు "నా మనవడు కలెక్టరు అయితడు" అని మా నాయన మీసం తిప్పేవాడు

"వాన్ని పొగిడి చదవకుండా చేయకుండ్రా చదువు సాగక పోతే మళ్ళీ కాడి దున్నవలసి వస్తది" అని మా నాన్న మీద తల్లి యిరుచుక పడేది. మా అమ్మా వాన్ని గారాబంగ బతి మిలాడేటిది. అందరు ముద్దు ముచ్చట చూడకుండా పోయారు. మిగిలిన నేను ముద్దు ముచ్చట అటుంచి ముదనష్టపు వ్యవ హారాలన్ని చూడాల్సి వచ్చింది;

చివరివరకు తాగిన చుట్టను నేలపై వేసి చెప్పుతో రాసాడు. ఈ లోపున జీప్ వచ్చి ఆగింది. తానే గేటు తెరచి కళ్లకు కొడుతున్న లైటు వెలుతురుకు చెయి అడ్డం పెట్టుకొని

నిలుచున్నాడు. దర్జాగా పుల్ సూట్ లో దిగిన కొడుకు మామూలుగా యింట్లోకి వెళ్ళబోతున్నాడు.

"ఏంరా నాయన యింత రాత్రి అయ్యింది."

కాలు ముందుకు సాగలేదు వెనక్కి మళ్ళి "ఎప్పుడొచ్చారునాన్న" రేబాన్ అద్దాలను సవరించుకుంటు

"నేను ఎప్పుడో వచ్చాను కానీ నీవు ఇప్పుడు రావటం ఏమిటి?"

"మాదో బోర్డు మీటింగ్ వుంటె దాన్ని అటెండ్ అయి" పెదాలపై నవ్వును పులుముకుంటు

"ఏ మీటింగ్ వున్నా, ఎన్ని పనులున్నా సాయంత్రం యిల్లు చేరాలని గుర్తుండదా మనషుల కంటే పక్షులే నయం చీకటి పడగానే గూడు చేరుతాయి"

తప్పు చేసిన వాడిలా తలవంచి నిలుచున్నాడు శ్రీనివాసరావు.

"నీవు నీ పనులు, నీ దోస్తులు, నీలోకం నీకే అయితే యిల్లెటు పోవాలి? పిల్లలూ? నీ భార్య బాగా చదువుకున్నదని మురిసితివి పొద్దల్లా యిల్లొదిలిపోయేది చూడవైతివి – నేనెందుకనాలి వెళ్ళిచూడు నీకే తెలుస్తది"

మత్తు దిగిపోయిన శ్రీనివాసరావు వెంటనే చకా చకా డైనింగ్ హాల్లోని వాష్ బేసిన్ దగ్గర ముఖం కడుక్కొని ఖర్చీఫ్‌తో అద్దుకుంటూ డైనింగ్ టేబుల్ వైపు చూశాడు అన్ని సర్ది వున్నవి. ఎవరూ తిన్నట్టు లేదు. ఓ చిట్టెలుక పెట్టివుంచిన మూతలను లేప లేక పాత్రల చుట్టుతిరుగుతు వుంది, దానిని కాపెట్టుకొని మూలన నక్కి కూర్చుంది పిల్లి.

కూతురు గదిలో విడియో ఫిల్మ్ నడుస్తున్న శబ్దం, కొడుకు గదిలో డిస్కోమ్యూజిక్ వినిపిస్తువుంది.

మేడపైకి ఎక్కి బెడ్‌రూంవైపు నడిచాడు. బోల్టు వేయకుండా మూసివుంచిన తలుపులను నెట్టుకొని లోనికి ప్రవేశించినా గమనించినట్టు లేదు భార్య.

ఆమె రౌండు బెడ్ మీద చిత్తుగా తాగి పడుకొని వుంది. ల్లారి ఉదయం గెస్ట్ రూమ్‌లో వెంకట్రామయ్య లేడు "శంకర్" కైవర్‌ను పిలిచాడు -రావు. డ్రైవరొచ్చి ముందునిలుచేగానే

"పితాజీ కాహా హై?"

శంకర్ మట్లాడ లేదు.

"బోలో పితాజి-"

అయ్యగార్ని ఉదయం ఐదు గంటలగే స్టేషన్‌లో వొదిలొచ్చాను, తమరికి చెప్పమన్నారు. అంటు హిందీలో జవాబిచాడు.

రావు నోట మాట రాలేదు.

ఒక్కసారే మనిషి కదిలిపోయి తనను తానే సంభాలించుకొని మౌనంగా లోనికి నఘచాడు. హైద్రాబాద్ వెలుతున్నరైలు తన తలపై నడిచి నట్లనిపించగా తనకు తెలియకుండానే "అమ్మా" అంటూ కణతలను వత్తు కుంటూలోని నడిచాడు. అప్పుడతనికి తన యిల్లు వైకుంఠపాళిలా కనిపించింది.



# దున్న

ఊళ్ళోని జనం అటూ ఇటూ పరిగెడుతున్నారు. కొందరు ఇళ్ళల్లో చేరి తలుపులు వేసుకుంటున్నారు, కుర్రకారు వేపచెట్లను, చింతచెట్లను ఎక్కి, మిద్దెలున్న వాళ్ళు మిద్దెలెక్కి చూస్తున్నారు కొన్ని తాటాకు దడులు పడిపోతున్నవి మరికొన్ని ఈతాకు పందిళ్ళు కూలిపోతున్నవి, కుక్కలు వెనక్కు వెనక్కు పరిగెడుతూనే మొరుగుతున్నవి. పందులు కంప చెట్లలో నక్కుతున్నవి. దున్న పోతు మాత్రం తోక పైకెత్తి మూతినివిరిచి పట్టి బుస కొడుతూ ఇష్టం వచ్చినట్టు పరుగులు పెడుతున్నది దాని వెనకాల కొందరు యువకులు కర్రలతో చింతల తోపువైపు గెదిమే ప్రయత్నం చేస్తునారు.

అప్పుడప్పుడు ఆ దున్నపోతు చెవులు నిక్కబొడిచి వాళ్ళ అలికిడినే వింటూ కనుగుడ్లను ఓరగ పెట్టి వాళ్ళ కదలికలనే చూస్తోంది. బాగా బలిసి నున్నగా నల్లగా నిగనిగలాడుతూ దృఢమైన కొమ్ములతో భయంకరంగా ఉంది. ఆ దున్నపోతు వట్టి దున్నపోతు కాదు అది అమ్మోవారి దున్నపోతు. ఊళ్ళో వాళ్లకు ఏ రోగాలు రావద్దని, పంటలు బాగా పండాలని, రెండేళ్ళ క్రితం రెండేళ్ళ దూడను వదిలితే, అది ఆ చేను ఈ చేను మేసి బాగా బలిసి తిన్నది అరగక అప్పుడప్పుడు పరుగులు పెడుతూ ఉంటుంది. దాన్ని ఎవరైనా ఏమైనా అంటే పగబట్టి వాళ్ళ

పని పడుతుందట. ఓ సారి ఓ పశువులకాపరి కర్రచూపి విదిలించునందుకు వాడిని తన కొమ్ములతో లేపి ఎనుగులో ఎత్తేసిందట. మరోసారి మంచె మీది నుండి పిట్టలు రాకుండా వడిసెలతో రాళ్ళు రువ్వితే ఓ రాయి దానికి తగిలితె, మంచె దిగిందాక మాటుకాచి అతని పక్క ఎముకలు విరిగే వరకు పొడిచిందట. ఇలాంటివే ఇంకా ఎన్నెన్నో—

అది పచ్చని చేను మేసినా, పండిన చేను తొక్కినా దాన్ని కొట్టొద్దు! ఎవరూ కొట్టరు!! ఎనుగు, విరగదొక్కినా దొడ్డిని పాడు చేసినా, ఎవరూ ఏమీ అనవద్దు! అనరు!! ఏమన్నా అంటె అమ్మవారికి కోపమొస్తుంది. "అమ్మవారికి కోపమొస్తె ఊరికి ఆపద వస్తుందని'' కరణంగారు మరీ మరీ చెబుతుంటారు. అలా చెప్పింది వినకుంటే కరణంగారికే కోపం వస్తుందట. కరణానికి కోపమొస్తె ఇక చెప్పేదేముంది? కానీ ఈ రోజు దాన్ని కర్రలతో తరుముతున్నారు. అంటే కరణం ఊళ్ళో లేడన్నమాట. కరణం ఊళ్ళో లేక పదిరోజులు కావస్తుంది. ఆయన ఊరుని ఇన్నిరోజులు వదిలి ఉండడం ఇదే మొదటిసారి. కరణీకాలను రద్దుచేసినట్లు రేడియో వార్తల్లో విని జిల్లా కెళ్లి మరునాడు అదే వార్త వివరంగా ఉన్న దినపత్రికను చంకలో పెట్టుకొని వచ్చి మళ్లీ అదే సాయంత్రం వెళ్ళాడంతే తిరిగి ఊరి మొహం చూడలేదు.

ఊళ్ళోకి జీపు వస్తున్న శబ్దం వినగానే దున్నపోతు

బెదరి ఊరవతలికి పరుగుతీసింది. జీపు ఊళ్ళో కొచ్చి ఊరి మధ్యన ఉన్న గుడివైపు దూసుకుపోయింది. అది చూసిన మస్కూరి దాని వెనకాల పరిగెత్తాడు.

"అవునూ! కర్ణపోడు ఇంకా దస్తరం ఒప్పజెప్పలేదట కద!" ఊళ్ళోకి వెళుతున్న జీపు వైపు చూస్తూ ఓ ముదుసలి అన్నాడు.

"అవునట" ఆ రోజు దినపత్రికను చదవడంలో మునిగివున్న నడీపయస్కుడు.

"దేశమంత ఇయ్యంగలేనిది ఊనికేమొచ్చిందో. ఇంకెన్నేళ్ళు ఏలుదామనకుంటుండో ఊరిని" నిష్ఠూరాన్ని వ్యక్తపరుస్తూ మరో వ్యక్తి.

"ఉన్నదంత దోసుకునే! ఏ మున్నదింక ఏలటానికి''-

అందరుకలిసి హైకోర్టుకు పోయింౢడట. ఏమైద్దో ఏమో ూడాలె'' పత్రిక చదువుతున్న వ్యక్తి.

"ఏమయ్యేది లేదు. వాల్ల పని తీరినట్టే. మాలిపటేల్, పోలీస్ పటేల్ ఇచ్చినట్టుగ, ఈయన కూడా కాయితాలొప్పజెప్పి నలుగురితో నారాయణ అనాలె అంతే!" ఇంతకు ముందు నిష్ఠూరాన్ని వ్యక్తపరిచిన వ్యక్తి తన నిర్ణయాన్ని తెలిపాడు.

"ఈనిది అనికి అనిది ఈనికి పెట్టి, నడుమ కైలాటకం పెట్టె. ఆబట్టేబాజీ చేతలు ఇగసాగవు"

పేపరు చదివే వ్యక్తికి టీ గ్లాసు అందిస్తూ అన్నాడు తన కడుపులోని కసిని కక్కుతూ టీకొట్టు సాహెబ్. అక్కడ జరిగే చర్చల నిర్ణయాన్ని ప్రకటించే అధ్యక్షుని లాంటి పాత్ర ఆతనిది. అయినా ఈడు, కాయితాలను ఎందుకిస్త లేడో" చదివిన పేపర్‌ను మరో వ్యక్తికిస్తూ.

"దాంట్లోనే ఉంది కిటుకు ఇంతకు ముందు సూడలే ఆ దున్నపోతుని బాగ తినమరిగి'' అన్నాడు హోటల్ సాహెబ్.

ఊరి మొదట్లో ఉన్న టీకొట్లో ఇలా జరుగుతోం. సంభాషణ.

పటేలు పట్వారి వ్యవస్థను రద్దు చేసిన తర్వాత చాలా మంది తమ తమ రికార్డులను ప్రభుత్వానికి సమర్పించారు. ఇవ్వని వాళ్ళల్లో ఈ ఊరి కరణం ఒకరు. ఈయన పేరు రంగా రావు. రాంగ్‌రావ్' అని కొంటె పేరుతో పిలుస్తారు కొద్ది ఇంగ్లీషు నేర్చిన పదో తరగతి ఫేలయిన కుర్రకారు. ఈయన తహసీల్ ఆఫీసులో పిల్లి, ఊళ్ళో పులి.

ఆ ఊరికి రెండు పెద్ద చెరువులున్నాయి. అందుకని వరి పంట ఎక్కువే చేపలూ పుష్కలం. ఆ ఊరి చుట్టూరా పెద్ద తాటి వనం ఉంది. కాబట్టి కల్లు కావడం ఎక్కువే కాపులకు. కర్నూలకు వచ్చే వారికి పొయ్యేవారికి పోను నాలుగైదు పట్టణాలకు ఇక్కడ నుండే లారీలతో సరాఫరా కూడా జరుగుతుంది. ఇక ఊరి రాబడి మనం ఊహించవచ్చు. అందుకని రంగారావు ప్రభుత్వానికి కాయితాలు అప్పజెప్పకుండా తిరుగుతున్నాడు. అందుకే అతనికి పెట్టిన రాంగ్‌రావు పేరు సరిపోతుందని పిస్తుంది.

ఆ రోజు మాత్రం కొత్తగా నియమించబడ్డ విలేజి అసిస్టెంట్ గారికి చార్జి విప్పించడానికి ఆర్ ఐ గారు వచ్చారు. మస్కూరి ముందు నడవగా గుడిని అనుకొని ఉన్న కార్యాలయపు గదిని చేరారు. తాళం విరగొట్టి చూశారు. అందులో ఏమీ లేవు, రెండు ఖాళీ ఆయిల్ పీపాలు, మరో రెండు గడ్డ కట్టిన సిమెంటు బస్తాలు తప్ప.

రంగారావు ఇంటిని సోదా చేయడానికి వెళ్ళారన్న వార్త ఊరంతా పాకింది జనం గుంపులు గుంపులుగా రంగారావు ఇంటి చుట్టూ మూగారు. రెండు ఎకరాల ఖాళీ స్థలంలో నిర్మించిన ఆ భవనం నగిషీలు చెక్కిన పెద్ద పెద్ద దర్వాజాలతో నవాబు గారి దేవిడీలా ఉంది. రంగారావుగారికి వచ్చే జీతం పందల్లో ఐనా వేలు సంపాదించే వ్యక్తి ఇల్లులా ఉంది. ఆ ఇల్లుచూసి ఆయన ఆదాయాన్ని అంచనా వెయ్యొచ్చు.

గుమిగూడిన జనంలో రకరకాల మాటలు. ఆ ఇల్లు నిర్మాణం మూడేళ్ళు జరిగిందట. ఈ వూరి రైతులు కొట్టిచ్చిన బండ్ల కొద్దీ తుమ్మచెట్లతో ఇటుకల బట్టీలను కాల్చారట. అంతే కాదు జాగీరు భూములను హరిజనులకు పంచగా వాళ్ళ తోటల్లో ఉన్న పెద్ద పెద్ద చింత, మామిడి, చెట్లను నరికి సున్నం కాల్పించారట కూలి లేకుండానే కులాల వారీగా పనిచేసి ఆ భవనాన్ని నిర్మించారట. ఈ పనులు జరిగినన్ని రోజులు గౌండ్ల వాళ్ళు వంతులువారీగా కుండలకొద్దీ కల్లు పంపేవారట. ఎందరో అధికారులు విస్కీని తలదన్నే ఈ ఊరి గట్టి కల్లుని తాగి ఈ భవనంలోనే విశ్రాంతి తీసుకునేవారట. అటువంటి ఇంటినిసోదా చేస్తామంటే ఆ ఇంటి ఆడవాళ్ళు, పిల్లలు అందరు ఒక్కసారే బిత్తరపోయి చూస్తునిలుచున్నారు.

మగవాళ్ళు ఊళ్ళో లేరు కాబట్టి ఇంటినిసోదా జరపడానికి వీల్లేదని కరణం భార్య అడ్డు చెప్పింది. అంతేకాదు తాళాలను తియ్యొద్దని అడ్డంకూడ నిలుచుంది. అయినా సోదజరగడం అగలేదు. చుట్టూరా ఉన్న జనం రంగారావు ఇల్లు సోదా జరుగుతుంటే చిరునవ్వుతో చూస్తున్నారు. ఎంతోమంది మగ వాళ్ళను బానిసల కంటే హీనంగా భావించి వాళ్ళ వాళ్ళ ఆడవాళ్ళ ముందే బూతులుతిడుతుంటే తలొంచుకొని నిలుచున్న వాళ్ళందరూ కరణం పరువు బజారులో మురికి కాలువలై పారుతూ ఉంటే కసిగా చూస్తున్నారు. ఇల్లంతా వెదికినా ఎలాంటి కాయితాలు బయటపడలేదు. ఆర్ఐ కి అర్థంకాక మస్కూరి వైపు చూశాడు. మస్కూరి వెంటయ్య తనఉద్యోగ రీత్యా కరణం అడుగులకి

మడుగులో త్తినాలోలోపల అతనంటే ఎంతో కోపం పగఉన్నాయి. అతనికి అలా పగ ఉండటానికి కారణం అతనికి ఇస్తానన్న పోరంబోకు భూమిని మరొకరికి పట్టా చేయించడమే!

ఆ రోజు పెంటయ్య కళ్ళ ముందు తిరిగింది....

"పంతులుగారు పోరంబోకు చెల్కగుడ్డం నాకిస్తనంటిరి. మరిగ పట్ట జేయిస్తే తమరి పేరు చెప్పకొని బతుకుత"

"చూద్దాం చూద్దాం" కరణం

"సూద్దాం అనకుండ్రి! మొదటి సంది తమరి కాళదగ్గరే పడివుంటున్న-గులాపోన్ని కాస్త నా పేర్న జేయిస్తే"

"చేయిస్తరా"

"గట్ట అనుండ్రి కాల్మొక్త" అంటూ చేతికర్రను ఎదమీద వొదిలి రెండు చేతులు జోడించి నమస్కారించాడు.

కరణం ఓ చిరునవ్వు నవిలేసి-

"ఎవర్రా! యింతకు ముందు కర్రలు పట్టుకొని ఉరుకుతూ వుండ్రు?"

"అల్లా? పందిని కొడుతుండ్రు పంతులు"

"ఎవన్నడిగి కొడుతుంద్రు"!

"ఆల్లపందే అది"

"అవ్రనా! ఆల్ల పందే కనీసం నిన్నన్న అడిగింద్రా?"

"యింగ అడిగినట్టే అనుకోంద్రి. ఏదో నాగ్గాడ యింత" మాటలను మింగుతూ అన్నాడు.

"గింత కాదు, మరింత కావాలను. అది కూడా మంచి వార్లే కావాలను. అర్థమైందా?" పెంటయ్య కదిలాడు.

"అవేయ్" కరణం

'ఆ' అంటూ ఆగాడు

"అట్లనే పెద్దగౌడ్ కాడికి పోయి, ఆ వాగుదగ్గర వంక తాడు లేదు? దానికి ఎల్లిందంత పంపమను. నీల్ల సుక్క కల్వొద్దు సుమా!'

'అయ్య'

"ఆల్లు చింతలకిందనే దిగినట్టున్నరు" గొంతు చిన్నగ జేసి అడుగుతు, పెంటయ్య దగ్గరకి వచ్చి ఏదో చెప్పబోయాడు.

"తమరు చెప్పాల్నా-"

''అవ్వను వాల్లు ఎన్నాళ్లుంటరట ఇక్కడ''

''నేను అడగలేదయ్య''

''గుడిసెలు పన్నాడున్నయి. మందిఎదరు''

''ఒక గుడిసెలో పుసలోల్లుంటరు. ఇంకోదాంట్ల అనిబిడ్డ

వుంటది''

''ఆ వయసుది అనిబిడ్డేనా?''

''ఆ''

''దూరంగ జూసిన''

''అమ్మో పసుగ్గొమ్మ'

''మొగడు లేడా?''

'యిడిసి పెట్టిండంట. పడుసుపోరగాల్లందరు వూరికే దానినే సూసుకుంట తిరుగుతుండ్రు. అదేమో పొద్దుకూకులు పందుల మేపుకొచ్చి రాతిబేల్ల గుడిసెల పడతది''

'అంటే'

మసూర్కారి నవ్వాడు. నవ్వుతూనే అక్కణ్నుంచి కదిలాడు

రాత్రి బాగా చీకటయ్యింది. అపుడపుడూ వాన చినుకులు రాలుతున్నవి. చింతచెట్టు మొదట మొదటి గుడిసె దగ్గర, ఓ మండుతున్న కుంపటి, దాని చుట్టురా కూర్చుని కల్లు తాగుతున్న వాళ్ళతోనే పెంటయ్యో ఉన్నాడు.

గొడుగుపట్టుకొని, ధోవతిని పూర్తి మోకాళ్ళ వరకు మడిచి పట్టుకొని, మూడవ గుడిసె ముందుకొచ్చి ఒకసారి అటూ ఇటూ చూసి లోపలికివెళ్ళి తెచ్చిన గొడుగును విప్పిగుడిసె ద్వారానికి అడ్డంగ పెట్టాడు కరణం.

అంతవరకు పడుకొని ఉన్న స్త్రీ లేచి కూర్చున్నటుంంది పిరుపుల చప్పుడు, గాజుల గలగలల శబ్దం ఒకేసారి వినిపించాయి. అప్పుడు అమె కొంగు బుజంపై నుండి వడిలో జారి ఆగింది ఆమె పంగి నిండు కల్లు పటువను వంచి గ్లాసులను నింపగ, అంచులనుదాటి పొరలి నేలన ఇంకిపోతున్నట్లు ఓ మాదిరిబుసబుస శబ్దం.

బాగా కాలిన పంది వార్ల మీద మిరియాలపొడి చల్లి గిన్నె నిండ తెచ్చి గుడిసెకు అడ్డంగ ఉన్న గొడుగును జరిపి, గిన్నెను లోపలికి నెట్టి మళ్ళీ గొడుగు సరిచేసి పోతూ "గిన్నె లోపలికి తీస్కొని, ముక్కలను తినుపించుకుంట దొరను కుసీచేసి, యింత సినగని వస్త్రం అడుక్కో" అంటూ వచ్చినంత వేగంగా చింత చెట్టు మొదలు వైపు నడిచింది. గుడిసెలోఉన్న యువతి తల్లి.

కరణం ఎంతో ఇష్టంగా ఆమె అందిస్తున్న మాంసపు ముక్కలను తినసాగడు. ఆమె తినిపిస్తూ, తాపిస్తూ, నవ్వుతూ నవ్విస్తూంది.

"పంది కూర మీరు కూడా తింటర పంతులూ!" విస్తుపోతూ అడిగింది ఆమె.

"పంది పరమాత్ముని స్వరూపం ఇష్టంగా భోంచేస్తాం''

కల్లు పటువ ఖాళీ అవుతుంది, మాంసం ముక్కలు మాయం అవుతున్నవి.

"నా యేలు కొరికేవు" అంది మాంసముక్క నోట్ల పెడుతూ కవ్వింపుగా.

కొరికితే ఏమవ్వద్ది అన్నట్టు చూసి, తినిపిస్తున్న ఆమెచేతిని తనచేతితో ఓసారి వొక్కి వదిలి' రవిక ముడి విప్పాడు. ఆ తర్వాత ఒకరి వీపున మరొకరి చేతులు. పాతికేళ్ళ పరువం కరణం కళ్ళల్లో ఇమిడి పోయింది,

కోడి కూసింది. మస్కూరి మైకంకాస్త దిగింది. తెల్లారితే అందరూ చూస్తారు. అందుకని కరణాన్ని లేపడానికి మూడవగుడిసె ముందుకొచ్చాడు. మత్తుగ నవ్వులు వినిపిస్తు న్నాయి లోపల నుంచి.

"నీ సిగ తరగ! ఎంత జాణవే నువ్వు. ఎంతటి సుఖాన్ని ఇచ్చావు. దొమ్మరింట్ల పుట్టినా దొరసాన్ని మించినవు"

"హు" అంటూ ఆతని ఎదమీద తనముఖాన్ని అనించి-

"అయితే నేను ఈ ఊర్లనే ఉండిపోనా!"

"వుండిపో కానీ ఈ విషయం...."

"ఎవ్వరికి తెల్వకుంట వుంచుతకానీ...." అంటూ ఎద మీద నుండి లేచి అతని కళ్ళల్లోకి చూసింది. అప్పుడు ఆమె కళ్ళ చుట్టుకరిగిన కాటుక మరీ వెడల్పు అయి, రాత్రంతా నిదుర కరువైనట్లు ఓ మాదరి అలసటను సూచిస్తుంది.

"కానీ"

"నాకింత సినగని వస్త్రం ఇప్పిస్తే" అంటూ అతని ధాతిని సరిచేసింది.

"అంటే" అంటూ ఆమె ఎత్తైన రొమ్ముల మధ్య చూపును నిలిపాడు.

అది గమనించిన ఆమె ఓసారి గట్టిగా కౌగిలించుకొని వదిలి కరణం కళ్ళల్లోకి చూస్తూ-

'తెలవదా' అంటూ అతని చెవి దగ్గరికి ముఖాన్ని పోనిచ్చి

నపుడు రాత్రి తలలోనలిగిన పూలు రాలికిందపడ్డాయి.

తెలవదు అన్నట్టు తలూపాడు

ఆమె నవ్వుతూ చెవిలో ఏదో చెప్పింది.

అంతే! తనకిస్తనన్న పోరంబోకు భూమి ఆమె పేర్న పట్టా చేయించాడు కరణం. అది గుర్తొచ్చేసరికి మస్కూరి పగకు పదునొచ్చింది. కసిగ పళ్ళుకొరికి తుపుక్కున ఉమ్మి, లోలోపల తిడుతూ ఆర్ ఐ వైపు చూశాడు. కాయితాలు ఎక్కడ దాచింది చూపిస్తరండని సైగ చేశాడు. తను ముందు, ఆర్ ఐ వెనక నడవగా ఇద్దరూ పిడకల గూడు వరకూ వచ్చారు. పెంటయ్య తన చేతిలోని కర్రతో పిడుకల గూడుని కూలదోసాడు గూడు మధ్య తెల్లనిగుడ్డలమూట బయటపడింది. పెంటయ్య విప్పి చూసి అర్ ఐకి చూపించాడు. ఆర్ ఐ అన్నీ తిరగేసి చూశాడు. ఒకరి భూమి మరొకరు కొన్నట్టు కొన్ని దస్తావేజులు, చిట్టాను పట్టి చూస్తే వసూలు చేసిన రకం అంతా ఖజానాలో జమ చేసినట్లు చాలనుల నమోదు దాఖలాలు ఏమీలేవు. మాఫి అయిన కార్లకు రకము వసూల్ చేసినటు కచ్చాచిట్టాలు కనిపించాయి. చౌఫస్ల, ఫహణీలను చూడగ అన్ని మార్పులు జమాబందీలో అమలులేవు. రజాకార్ల తర్వాత పాకిస్తాను పెళ్ళిన వాళ్ళ భూములు మరొకరు కొన్నట్టు దస్తావేజులు ఉన్నాయి. కరువు కాలంలో ప్రభుత్వం మంజూరు చేసిన గడ్డిని ఎప్పుడూ పంచ లేదు. అసలు అలాంటి గడ్డి ఊళ్ళో కెపుడూ రానేలేదట. కానీ

ఒచ్చినట్టుగ, రైతులకు పంచినట్టుగ కాగితాలపై వేలిముద్రలు!

అతనికున్న చెలుకలు, బావులు, సీలింగ్‌లో పోకుండా చుట్టాల పేర్నకొంత, తోటలు పెంచి కొంత కాపాడుకుంటూ వచ్చాడు ఎంతో మంది రైతుల పట్టా కాయితాలు కరణం దగ్గరే ఉన్నాయి

ఆర్ ఐ కాగితాలను వివరంగా చదివి వాటిని వేరుచేసి, వాటిల్లోని పట్టాలు ఎవరెవరి పేరుమీద ఉన్నవో వాళ్ళకుఇచ్చాడు తరతరాల ఊరి గుట్టు పట్వారీ పందిరి దాటి ప్రజల్లో కొచ్చింది. మందిని వరసలో నిలిపి "పటేల్ ఒప్పజెప్పినట్టు ఈ కర్నపోడు ఊకే కాయిలతాను వొప్పజెప్పక ఏందన్న! ఈ బాగోతం అంటూ మళ్ళీవున్న చోటికే వచ్చి తనచేతి కర్రను సంక కింద ఆస రాగ పెట్టుకుని నిలుచున్నాడు పెంటయ్య.

''ఏం మసూర్కరన్నా రాంగ్‌రావు ఈ ఊరికి రానేరాడ" అక్కడున్న కుర్రాళ్ళల్లో ఒకడడిగాడు.

''వస్తడో సస్తడో ఎట్లసెప్పుతం'' ఎడమచేతిని ఓమాది రిగా తిప్పుతూ ఏసారినట్టుగా చెప్పాడు పెంటయ్య.

"మీ మీ శిస్తులు సకాలంలో చెల్లించి వీటిల్లో నమోదు చేయుంచు కోవాలి, మీ భూమి హద్దుల మీద మీకేమైనా అనూమానాలుంటే తిరిగి కొలత వేయించుకోండి'' అని చెప్పాడు

విలేజి అసిస్టెంట్.

ఆపుడే కాలేజీ నుండి వచ్చిన ఊడుకురక్తం కాబట్టి జరిగిన అన్యాయాల్ని చూస్తూఉంటే అతని వళ్ళు మండిపోయి కళ్ళు ఎర్రపడ్డవి. అందువల్ల అతను ఉద్రేకంతో కరణం పన్నిన కుట్రలన్నీ విప్పి చెపుతూవుంటే ఆఊరి ఆడ జనం ముక్కుమీద వేలేసుకుంటున్నారు. మగవాళ్ళు కళ్ళెర్ర జేస్తున్నారు. కాగితాల మీదున్న విషయాలకు జనం చెబు తున్న విషయాలకు ఎక్కడా పొంతన లేకుండాపోయింది. కసితో కోపంతో అక్కడవున్న జనం పిడికిళ్ళు బిగుస్తూవున్నవి. వేడిశ్వాసలను వదులుతూ అందరూ ఒక్కసారే కరణం ఇంటి వైపు చూస్తున్నారు. ఏదో ప్రళయం రానున్నది గ్రహించిన ఆర్ ఐ వాళ్ళని వారించే ప్రయత్నంచేశాడు. అయినా జనం వినలేదు. పోలీసుకు రిపోర్టిస్తానన్నాడు. ఎవ్వరూ పట్టించు కోలేదు. కరణానికి ఇంతవరకు నీడలా ఉన్న మస్కూరి ఈ రోజు విలేజి అసిస్టెంట్ వెంట ఉన్నాడు. అందరూ కరణం ఇంటిని చుట్టు ముట్టారు. జనం నానారకాలుగా తిట్టారు "ఈ ఊరిని తన జాగీరుఅనుకునే, అందిన కాడిల్ల అందరినీ దోసుకునె! ఎదురుతిరిగి నోల్లవి ఏదో కేసులో ఇరికించి పోలీసోల చుట్టు కోర్టులచుట్టు తిప్పిచ్చె, కట్టెకమ్మగిట్ల తెచ్చుకుంటే కట్టేసి కొట్టిచ్చె. ఎవ్వలన్న ఆకలిగొని దూపగొని కల్లుగట్ల దొంగత నంగ తాగితే గుండు కొట్టిచ్చి గాడిద మీద ఊరేగిచ్చె. మరి ఈడు ఇన్ని తప్పులుచేస్తే మరి ఈన్నెందుకు వొదలాలె? ఈ దస్త్రాలను మార్చడం, జనాన్ని మోకచేయడం, కల్లూ కట్టెల దొంగతనం

కంటే ఎక్కువ గద! ఈనికి తగిన సిగిచ్చి సెయ్యాలె. ఎన్నాళ్లు దాసుకొని తిరుగుతడు" అన్నాడు ఆవేశంగా మస్కూరి పెంటయ్య. కరణం నౌకరి ఊడి, తన నౌకరి ఉన్నందుకు మురిసిపోతూ కనిపించిన వాళ్ళందరినీ పలుకరిస్తున్నాడు. రకరకాల వ్యక్తుల రకరకాల మాటలు. ఒక్కొక్కని కళ్ళనుండి ఎప్పటి కోపమో నిప్పులై దూకుతున్నవి.

వీళ్ళరాకను గమనించిన కరణం భార్య పిల్లలు వరండాక పరకు వచ్చి భయంభయంగా చూస్తున్నారు.

మీరంతా కరణం వచ్చేవరకు ఆగాలి. అంతే కాదు మీకు జరిగిన అన్యాయాలను ప్రభుత్వానికి తెలియపరుచుకొని న్యాయం జరిగేటట్టు చూసుకోవాలి. లేదా కోర్టుకు వెళ్ళాలి. ఏదిచేసినా చట్టప్రకారంగా చేయాలి కానీ ఇతని ఇంటిమీదపడి ఏవో పాత పగలను తీర్చుకుందామనుకునే మీ దోరని సరైనది కాదు" అని అన్నాడు ఆర్ ఐ.

"ఆయన వొచ్చినాక ఓ మీటింగ్ పెట్టి అన్ని విషయాలు అడుగుదాం వదలొద్దు. అన్యాయాన్ని ఎదిరించవలసిందే కాబట్టి మీరందరూ దయచేసి వెళ్ళవలసిందిగా కోరుతున్నాను" అని పిడి అసిస్టెంట్ అనగానే తమలో తామే గొణుక్కుంటూ అందరూ అతికష్టంగా అక్కించి కదిలారు. వినగూడని మాటలను వొదిలారు.

◆ ◆ ◆

ఊళ్ళోకి బస్ వచ్చి పోతుంది కాబట్టి అన్ని డిపార్టుమెంటల వాళ్లు వస్తూవున్నారు. వ్యవసాయ శాఖవాళ్లు, అరోగ్యశాఖవాళ్ళు సినిమా చూపించే వాళ్ళు రోజు ఎవరో ఒకరు వచ్చి పోతూనే ఉన్నారు. అన్ని శాఖల వాళ్ళు వచ్చినట్లుగానే ఆరోజు పశు వైద్యశాఖవాల్లు వచ్చారు. ఊళ్ళో దున్నపోతు సృష్టిస్తున్న దుస్థితిని విన్నారు. గ్రామంలో కొంత మంది బాధితులు దాని ఆగడాలనూ, అరాచకాలను అరికట్టాలన్నారు. ఊరికి మేలు జరిగే మాట అటుంచి దానివల్ల జరిగే కీడుని భరించడం కష్ట మైందన్నారు, ప్రజలు ఫిర్యాదుల మేరకు పశువైద్యశాఖాధి కారులు పగ్గాలను విసిరారు. కాళ్ళుకదలకుండాకట్టేసి కొమ్ములను నేలకు అనగపట్టి సంభందిత పరికరంతో విత్తు కొట్టారు కొన్ని రోజులు ఆ చెట్టు నీడన ఈ చెట్టునీడన పడుకొని ఆ తర్వాత అది పుట్టిన దొడ్డివైపు పోయిందా దున్న అంతే కాదు అది మళ్ళి ఎన్నడూ పరుగులు పెట్టలేదు. ఊరి జనం ఆది ఇదని గాని గివా తర్వాత ఎవరూ పట్టించుకోలేదు.

వారం తర్వాత ఓ రోజు సాయంత్రం మాజీ కరణంగారు బస్సు దిగి తన ఇంటివైపు వెలుతూవుంటే ఎవరూ పలుకరించ లేదు. నడిబజార్లో పడుకొని ఉన్నఅమ్మవారి దున్న కరణాన్ని చూడగానే లేచి ఓ మాదిరి దీనమైన శబ్దం చేసింది. దున్న పోతుని ఆ ఆకారంలో చూడగానే కరణానికి కళ్ళు తిరిగినట్లైముసి రిన ఆలోచనలతో ఇంటివైపు నడిచాడు.



# PUBLISHER'S NOTE

## మా కథ

పదిహేనుఏళ్ళ క్రితం నల్లగొండ లోని ఏకాభిప్రాయం గల కొందరం కలసి "సాహితీ మిత్రులు, నల్లగొండ" అనే సంస్థను స్థాపించాం. సాహితీ సమావేశాలను నిర్వహించడం, సాహితీ మిత్రుల రచనలను, కథలను సంకలనాలుగ ప్రచురించడం' మా సంస్థ యొక్క ఉద్దేశాలు.

## మా కథల కథ

1980 లో "గాజెలు" కథా సంకలనాన్ని ప్రచురించాం. ఆ పుస్తకానికి అ పేరు బాగా కుదిరిందని తర్వాత తర్వాత గాని తెలియలేదు. అంతే కాకుండా, సుప్రసిద్ధ రచయత శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రి గారు దీనికి పరిచయ వాక్యాలు వ్రాయడం ఓ విశేషం. ఈ పుస్తకం కౌలంపూర్‌లో జరిగిన రెండవ ప్రపంచ తెలుగు మహాసభల నుండి విడుదల చేయబడటం అక్కడి తెలుగు సోదరుల మన్ననలను పొందడం అనుకోకుండా లభించిన ఓ మంచి అవకాశం. ఆ తర్వాత 1983 'ఎచ్చరిక ' కథలను ప్రచురించాం.

అప్పటినుండి మా కథలు బంగారు కథలయ్యాయి. ఆ తర్వాత 1985లో వెలుతురు కవితా సంకలనాన్ని ప్రచురించాం. కవితా సంకలనంగూడా ఎంతో ప్రశంసలను అందుకుంది.

"జూన్ 1976లో నల్లగొండ సాహితీమిత్రులు బోయ జంగయ్య కవితా సంకలనం, నడుస్తున్న చరిత్ర, ప్రకటించారు. అప్పుడే నడుస్తున్న చరిత్రను సాంతం చదివి సంతోషించాను. నడుస్తున్న చరిత్రలోని ఖండికలు పద్దెనిమిది, పుటలు ఇరవై, ఆ నాడే అన్నాను వ్యాసుని నాటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలు, నేటి మహాకావ్యం పద్దెనిమిది పుటలు అన్న శ్రీశ్రీ మాటకు 'నడుస్తున్న చరిత్ర' జంగయ్య కవితాసంపుటి నిదర్శనమని, నా కట్లా అనిపించింది.

ఈనాడు 'వెలుతురు' చిందిస్తూ జంగయ్య మరో కవితా సంకలనం మనముందుకు వస్తున్నదివెలుతురు జాడలుగని నా గొడవ కొక్కరకో అంటున్నది.

హనుమకొండ — కాళోజి

ఇన్నాళ్ళుగా కథలు నడిపిన జంగయ్య ఇప్పటి కవితా సంపుటి తీసుకొస్తున్నాడు. ఈ సంపుటిలోవున్న చాలా కవితలు ప్రత్యక్షంగాచూసిన సత్యాలకు కట్టిన చట్రాలు.

కథారచనలో జంగయ్యకు బలమైన గొంతు ఏర్పడింది, కవితల్లో కదిలించే గుండె కదనుతొక్కింది. పలుకూ పదునూ కాపాడుకుంటూ జంగయ్య మరిన్ని చక్కనికవితలు వ్రాయాలని కోరిక. బోయ జంగయ్య 'వెలుతురు'' కు ఇదే నా ప్రసరణ

19-2-86 — సి. నారాయణరెడ్డి
హైదరాబాదు — వైస్‌ఛాన్సలర్, సార్వత్రికవిశ్వవిద్యాలయం

తర్వాత 1988లో 'జాతర' నవలను ప్రచురిస్తే, దానిని మైసూరు విశ్వవిద్యాలయం వాళ్ళు బి.ఎ.,ఇడికి ఉపవాచకంగ ఎంపిక చేశారు. దానికి ముందు మాటరాస్తూ-

"జీవితం గురించి బాగా తెలిసిరాసే అరుదైన రచయితల్లో బోయ జంగయ్య గారు ఒకరు. అయన అర్బన్ రచయిత కాదు 'జాతర' నవల ఆయిన ప్రజ్ఞకు ఒకమచ్చు తునక.

ఈ నవల గ్రామీణ జీవితానికి అద్దం పడుతూ వారు ఎలా పూజారి వర్గం దోపడికి గురువుతున్నారో స్పష్టంగా చూపిస్తుంది. ఇందులో సిద్ధాంతాలు, స్లోగన్లు, చర్చలు వాదోపవాదాలు ఏమీ లేవూ. కథ ప్రవాహ సదృశంగా సాగిపోతు జీవిత సత్యాలను ఆవిష్కరించి మూఢనమ్మకాలను పటాపంచలు చేస్తుంది అంత కంటే సాంఘిక ప్రయోజనం ఏమికావాలి? రచయిత స్థితప్రజ్ఞుడు దేన్ని ద్వేషించలేదు. ఎవర్ని తిట్టలేదు, ఉన్నది ఉన్నట్లు చెప్పాడు, వీలైతే కాదు, తప్పకుండ మన సమాజం ఇటువంటి దురన్యాయాల నుండి దుష్ట సంప్రదాయాల నుంచి బయట పడాలి. ఈ సందేశంకూడా కథ చదివాక మనలో కలుగుతుంది కాని ఇలా చెయ్యమని కథలోంచి రచయిత బయిటికొచ్చి గోల పెట్టడు జంగయ్య గారు. మంచి కథకుడు.

-పురాణం సుబ్రహ్మణ్యశర్మ

-కొన్ని మంచి పుస్తకాలను చదువుతున్నప్పుడు చూపులు పంక్తుల వెంట పరుగెడుతున్నాయని, పేజీలు తిప్పుతున్నామని మనకు స్ఫురించదు. సాక్షాత్తుగా యథార్థ జీవిత దృశ్యాలను చూస్తున్నట్టే ఉంటుంది 'జాతర' నవల అలాంటిది. రచయిత తీసుకున్నది నల్లగొండ జిల్లాలోని గ్రామీణ ప్రాంతం ఇతర ప్రాంతాల పాలిటి చీకటి గదిలాంటి ఆ ప్రాంతంలో 'స్విచాన్' చేయగానే వెలిగిన దీపంలా 'జాతర' నవల వెలువడింది. అక్కడి ప్రజాజీవనం దాని మంచి చెడ్డలతో నిమ్నోన్నతాలతో, మేలుకోళ్ళతో దృశ్యమానమై పోయింది. మంచి సాహిత్యాని కింతకంటే కావలసిందేముంది?

అటు సామాజిక విషయ పరిజ్ఞానమూ ఇటు శిల్పమర్మజ్ఞత సమపాళ్ళలో మేళవించిన విశిష్ట రచన-'జాతర'

మోతుబరులైన రైతులు వారి కుటుంబాలలోని స్త్రీలు, నౌకర్లు, కూలీలు, వృత్తి పనివాళ్ళు, పోలీసులు, పూజారులు మొదలైన వారితో ఇదులోని గ్రామీణ వ్యవస్థకు నిండుదనం చేకూరింది. అక్కడ వేరూనుకున్న అర్థంలేని ఆచారాలను, అంధ విశ్వాలను ఖండించడంలో నవలా ప్రయోజనం సముచితంగా నెరవేరింది. 'జాతర', తిరణాల, ఉత్సవం-ఇలా పేర్లు విభేదించినా, దేశమంతటా ఇంచు మించు ఒకేవిధంగా కొనసాగుతున్న 'జాతర దృశ్యాలు' కళ్ళకుగట్టినట్టుగా చిత్రితమయ్యాయి పాత్రల సంభాషణల్లోని తెలంగాణా సజీవ భాష ఈ నవల సహజ సుందరంగా రూపొందడానికి తోడ్పడింది.

ఆంధ్రప్రభ;

-మధురాంతకం రాజారాం

జాతర సజీవ రచన. వాస్తవిక చిత్రణ. జీవిత అనుభవం పండిన భావాలు. మర్మస్పృక్కులైన మాటలు. జాతర నాకు నచ్చింది."

హైద్రాబాద్ —బి. రామరాజు

"—జానపదుల అసలైన సిసలైన హృదయం తెలిసిన రచయిత శ్రీ బోయ జంగయ్య వారి ప్రతిరచన జానపదుల హృదాయాలకు నిలిపిన నిలువుటద్దం.

హైద్రాబాద్ —కూమాటి దొనప్ప

—ఈ నవలలో నల్లగొండ జిల్లా పల్లె వాతవరణాన్ని సహజ సుందరంగా వెల్లడించిన నవలా 'జాతర' ఈ నవలలో పాత్రల చేత నల్లగొండ జిల్లా ప్రవాస బాషను వాడడం సముచితంగా ఉంది. రచయిద వ్యాఖానాలకు శిష్టి వ్యవహారికాన్ని వాడారు. దీనివల్ల నవలకు చివరంటూ చదివించే గుణం అలవడింది. అంతే కాకుండా శిల్పనైపుణ్యం పాఠకులను చకితులను చేస్తుంది.

—కాసుల ప్రతాపరెడ్డి

ఉదయం

"గొర్రెలు" కథలు వెల. 5/-

"ఎచ్చరిక" కథలు వెల. 7/-

"జాతర" నవల 10/-

కాపీలు కావలసిన వారు బి. సిద్ధార్థ H No. 7-5-68/E2 చేతన కాటేజ్, మాన్యంచలుక, నల్లగొండ. 508 001 కు వ్రాసినచో డిస్కౌంట్ వివరాలు తెలియపరచబడును.